


**23-09-2017**
శనివారం
పగలు: ధ్వజారోహణం
రాత్రి: పెద్దశేషవాహనం

**24-09-2017**
ఆదివారం
పగలు: చిన్నశేషవాహనం
రాత్రి: హంసవాహనం

**25-09-2017**
సోమవారం
పగలు: సింహవాహనం
రాత్రి:
ముత్యపుపందిరివాహనం

**26-09-2017**
మంగళవారం
పగలు: కల్పవృక్షవాహనం
రాత్రి: సర్వభూపాలవాహనం

**27-09-2017**
బుధవారం
పగలు: పల్లకీలో
మోహినీఅవతారోత్సవం
రాత్రి: గరుడవాహనం

**28-09-2017**
గురువారం
పగలు:
హనుమద్వాహనం
రాత్రి: గజవాహనం

**29-09-2017**
శుక్రవారం
పగలు: సూర్యప్రభవాహనం
రాత్రి: చంద్రప్రభవాహనం

**30-09-2017**
శనివారం
పగలు: రథోత్సవం
రాత్రి: అశ్వవాహనం

**01-10-2017**
ఆదివారం
పగలు: చక్రస్నానం
రాత్రి: ధ్వజావరోహణం

# భగవద్గీత

**శ్లో : క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్త్వ య్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్య క్త్వోత్తిష్ఠ పరంతప ॥** (భగవద్గీత.2-3)



ప్రతిపదార్థం : పరంతప!=శత్రువుల్ని తపింప చేసే శక్తి గలవాడా!; పార్థ!= ఓ అర్జునా!; క్లైబ్యం= అధైర్యాన్ని; మాస్మగమః= పొంద వద్దు; ఏతత్= ఇట్టిస్థితి; త్వయి= నీయందు (నీకు); న+ఉప పద్యతే= ఏర్పడతగింది కాదు; క్షుద్రం= నీచమైన; హృదయ దౌర్బల్యం= మానసిక అశక్తత; త్యక్త్వా=వదలిపెట్టి; ఉత్తిష్ఠ=లెమ్ము (యుద్ధానికి సిద్ధం కమ్ము).

భావం : శత్రువుల్ని చీల్చిచెండాడే అర్జునా! ఇలా అధైర్యపడడం నీకు తగింది కాదు. నీచమైన ఈ మానసికదౌర్బల్యాన్ని పూర్తిగా వదలి, యుద్ధం చేయడానికై లెమ్ము.

# యశోద ముంగిటి ముత్యము

ముద్దుగారే యశోద ముంగిటి ముత్యము వీఁడు
తిద్దరాని మహిమల - దేవకీసుతుఁడు

అంత నింత గొల్లెతల - అరచేతి మాణికము
పంతమాడే కంసుని - పాలి వజ్రము
కాంతుల మూఁడు లోకాల - గరుడపచ్చఁబూస
చెంతల మాలోనున్న - చిన్ని కృష్ణుడు

రతికేళి రుక్మిణికి - రంగుమోవి పగడము
మితి గోవర్ధనపు గో - మేధికము
సతమై శంఖు చక్రాల - సందుల వైడూర్యము
గతియై మమ్ముఁ గాచేటి కమలాక్షుఁడు

కాళింగుని తలలపైఁ - గప్పిన పుష్యరాగము
యేలేటి శ్రీ వేంకటాద్రి - యింద్రనీలము
పాలజలనిధిలోనఁ - బాయని దివ్యరత్నము
బాలునివలెఁ దిరిగీఁ - బద్మనాభుఁడు (3 - 577)





బాలకృష్ణుడు ఇద్దరుతల్లుల ముద్దుబిడ్డడు. శ్రీకృష్ణుని కొందరు ప్రణయంతో సాధిస్తే - మరి కొందరు పగతో సాధిస్తారు. బాలునివలె తిరిగే యోగేశ్వరేశ్వరుడు కృష్ణుడు. రత్నాల గుణాలన్నీ ఈ రాజీవాక్షునిలో రాశీభూతమై నిలిచినవి.



## భక్తుల సేవలో...

# 'గోవింద తిరుమల తిరుపతి దేవస్థానమ్స్' యాప్




ప్రపంచవ్యాప్తంగా ఉన్న శ్రీవారి భక్తులకు మరింత చేరువయ్యేందుకు 'గోవింద తిరుమల తిరుపతి దేవస్థానమ్స్' యాప్ ప్రారంభం. ఈ యాప్‌ను మార్చి 29వ తేదీన ఉగాదిరోజున తి.తి.దే. కార్యనిర్వహణాధికారి ప్రారంభించారు. టి.సి.ఎస్. సహకారంతో రూపొందించిన ఈ మొబైల్ యాప్ ద్వారా భక్తులు వేగంగా, సులభంగా ఎక్కడి నుంచైనా సేవలను పొందవచ్చు.

ఇందులో ఈ-హుండీ, ఈ-డొనేషన్, రూ.300/- దర్శన టిక్కెట్ల బుకింగ్ సదుపాయాలు ఉన్నాయి. దశలవారీగా తి.తి.దే. సేవలన్నింటినీ ఈ యాప్‌ను డౌన్‌లోడ్ చేసుకోవచ్చు. తి.తి.దే. వెబ్‌సైట్‌కు 33 లక్షల మంది యూజర్లు ఉన్నారు. కావున, వీరందరూ ఈ యాప్‌ను డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

## 2017 సెప్టెంబరు నెల ఉత్సవాలు, పర్వదినాలు

| | |
|---|---|
| 02 | వామనజయంతి |
| 05 | అనంతపద్మనాభవ్రతం |
| 08 | ఉండ్రాళ్లతద్దె |
| 12 | కావేరినది పుష్కరాలు ప్రారంభం |
| 19 | మహాలయ అమావాస్య |
| సెప్టెంబరు 23 నుండి అక్టోబరు 01 వరకు | తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవాలు |
| 27 | తిరుమల శ్రీవారి గరుడసేవ |
| 28 | దుర్గాష్టమి |
| 29 | మహానవమి |
| 30 | విజయదశమి |

## మీ మాట

### చాలా బాగున్నాయి..!!

జూలై నెల 'సప్తగిరి' మాసపత్రికలో అన్ని వ్యాసాలు చాలా బాగున్నాయి. ప్రతి వ్యాసం భక్తులకు ఉపయోగకరంగా ఉంటున్నది. ముఖ్యంగా 'పరమయోగివిలాసం' ధారావాహిక మాకు చాలా విషయాలు తెలియజేస్తున్నది.

ప్రతి పుటలోనూ మీరు అందిస్తున్న సూక్తులు పాఠశాలలో మా విద్యార్థులకు ప్రతిరోజూ నల్లబల్లమీద వ్రాసి విశదీకరిస్తున్నాం. ఈ సూక్తులు పిల్లలను నైతికత విలువల వైపు మళ్లిస్తున్నాయి.

'వైకుంఠపాళి' శీర్షిక మా ఆధ్యాత్మికజ్ఞానాన్ని, జిజ్ఞాసను పెంపొందిస్తున్నది. పి. శివప్రసాద్ అందిస్తున్న ముఖచిత్రాలు బాగుంటున్నాయి. సకాలంలో పత్రికను అందిస్తున్న మీకు ధన్యవాదాలు.

*– డా॥ బి.ప్రమీల, విజయవాడ.*

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

# సప్తగిరి

సంపుటి : 48 ఆగష్టు, 2017 సంచిక : 03



వేంకటాద్రి సమం స్థానం
బ్రహ్మాండే నాస్తి కించన।
వేంకటేశ సమో దేవో
న భూతో న భవిష్యతి ॥

**గౌరవ సంపాదకుడు**
శ్రీ అనిల్‌కుమార్ సింఘాల్, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తి.తి.దేవస్థానములు.

**ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు**
డా॥ కె.రాధారమణ, ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

**సంపాదకుడు**
డా॥ వి.జి.చొక్కలింగం, ఎం.ఏ., పిహెచ్.డి.,

**ఉపసంపాదకుడు**
డా॥ కంపల్లె రవిచంద్రన్,
ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

**ముద్రాపకుడు**
డా॥ టి. రవి, ఎం.ఏ., పిహెచ్.డి.,
పౌరసంబంధాధికారి, తి.తి.దే., తిరుపతి &
ఉపకార్యనిర్వహణాధికారి
(ప్రచురణలు & ముద్రణాలయం) ఎఫ్.ఏ.సి., తి.తి.దే., తిరుపతి

**చిత్రకారుడు**
శ్రీ పి.శివప్రసాద్, తి.తి.దే., తిరుపతి.

**ఫోటోలు**
శ్రీ పి.ఎన్.శేఖర్, ఫోటోగ్రాఫర్, తి.తి.దే.
శ్రీ పి.వెంకట్రమణ, సహాయఫోటోగ్రాఫర్, తి.తి.దే.,

సప్తగిరి మాస పత్రిక

ఇతర వివరాలకు
0877-2264543

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ. 500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-

## ఈ నెలలో....



ముఖచిత్రం : వైభవోత్సవముల పావనమూర్తి
వెనుక చిత్రం : శ్రావణలక్ష్మికి స్వాగతం





వెబ్‌సైట్- www.tirumala.org, www.tirupati.org; ఆన్‌లైన్ సేవలు/వసతిసౌకర్యం కొరకు- www.ttdsevaonline.com

సంపాదకీయం

# శ్రావణలక్ష్మికి స్వాగతం!

సమస్తసంపదలకూ మూలం మహాలక్ష్మి. ఆమె కృపవల్లనే మనకు ఆకర్షణీయమైనరూపం ఏర్పడుతోంది. ఆమె కృపవల్లనే విద్యాధికులమై, విఖ్యాతి పొందుతున్నాం. లక్ష్మీకటాక్షం మానవులందరికీ అవసరమే. ఆ దేవిదయ ఉంటే అన్నింటా అభివృద్ధే! అంతులేనన్ని సంపదలు! ఆమెఅనుగ్రహం పొందాలనుకునేవారందరూ ఆమెప్రాణనాథుడు శ్రీమహా విష్ణువుజన్మనక్షత్రమైనశ్రవణానక్షత్రంపేరు మీదుగా ఏర్పడ్డ శ్రావణమాసంలో విష్ణువల్లభను శ్రద్ధాభక్తులతో కొల్చి, ఆమె అనుగ్రహానికిపాత్రులై ధనకనకవస్తువాహనాలు పొందాలని కోరుకుంటూ, ఈ మాసంలో ఆచరించాల్సినవిధులను వివరిస్తున్నాం.

సకలసౌభాగ్యాలకు, సిరిసంపదలకు, శుభకార్యాలకు ఆవాసం శ్రావణమాసం. కాబట్టి సంప్రదాయాలను పాటించే ప్రతిఇంటిముంగిటా చక్కగా నీళ్లు చల్లి, ముగ్గులుపెట్టి, గుమ్మాలన్నీ మామిడితోరణాల తోటీ, గడపలు పసుపూ కుంకుమలతోటీ శోభాయమానంగా కనిపించేఇంటిలో ఘల్లుఘల్లుమనే అందెలసవ్వడితో లక్ష్మీదేవి కాలు పెడుతుంది. అమ్మపాదస్పర్శసోకితే నట్టిల్లు బంగారంగా మారుతుంది. ఇక ఆ ఇంటిలో సిరిసంపదలకు కొదవుండదు.

ఈ మాసంలో వచ్చే సోమ, మంగళ, శుక్ర, శనివారాలు ఎంతో పవిత్రమైనవి. మంగళగౌరీవ్రతం, నాగపంచమి, భానుసప్తమి, పుత్రదాఏకాదశి, దామోదరద్వాదశి, వరాహజయంతి, శ్రీవరలక్ష్మీవ్రతం, జంధ్యాలపౌర్ణమి, పోలాల అమావాస్య వంటి పండుగలు, పర్వదినాలు ఈ మాసంలోనే వస్తాయి.

మంగళకరమైన తల్లి మంగళగౌరీదేవి. పెళ్లికానిపడుచులు గౌరీదేవిని పూజిస్తే మంచిభర్త లభిస్తాడని, పెళ్లైనవారు ఈ వ్రతం ఆచరిస్తే సౌభాగ్యం కలుగుతుందనీ, కోరినకోరికలు తీరతాయనీ ప్రతీతి. అందుకే నూతనవధువులు సౌభాగ్య సిద్ధికోసం ఈ మాసంలోని ప్రతిమంగళవారం మంగళగౌరీవ్రతం ఆచరించడం సంప్రదాయం. పసుపు, కుంకుమ, పూలు, సుగంధద్రవ్యాలు, ఆవునేతితో వెలిగే జ్యోతిరూపంలోనూ మంగళగౌరి కొలువై ఉంటుంది. అందుకే ఈ మాసంలో ఇంటికి వచ్చిన ముత్తయిదువులకు మంగళకరమైన వస్తువులను ఇచ్చి, వారిఆశీర్వాదం పొందడం శుభకరం.

హిందువులప్రధానమైనపండుగల్లో నాగపంచమి ఒకటి. పెళ్లికావలసినయువతులు, గర్భధారణలో ఆటంకాలు ఏర్పడుతున్నవారు, కుజదోషం కారణంగా వివాహం ఆలస్యం అవుతున్నవారు ఈ పండుగను జరుపుకుంటే, అడ్డంకులు తొలగి సాంత్వనం చేకూరుతుంది. ఈ రోజున గోడపై పసుపుకుంకుమలతో నాగమూర్తులను లిఖించిగానీ లేదా మృత్తికాదులతో నిర్మించిన సర్పాల్నిగానీ పూజించాలి. పంచమిరోజు సర్పాలను పూజించినవారికి సర్పభయం ఉండదని విశ్వాసం.

ఈమాసంలో ప్రత్యక్షనారాయణుడైనసూర్యుణ్ణి ఆరాధించడంవల్ల ఆరోగ్యం చేకూరుతుంది. అభీష్టాలు సిద్ధిస్తాయి.

శ్రావణశుద్ధఏకాదశికి పుత్రదా ఏకాదశి అని పేరు. పూర్వం రాజులు పుత్రసంతానంకోసం ఈ వ్రతం ఆచరించి, ఫలితాలు సాధించేవారు. కాబట్టి ఈ ఏకాదశినాడు శ్రద్ధగా విష్ణుపూజ చేస్తే సంతానప్రాప్తి కలగడం తథ్యమని పురాణకథనం. ఈరోజున విష్ణుపూజ, ఉపవాసం, జాగరణంచేసి, గొడుగు దానం చేస్తే విశేషపుణ్యదాయకం.

దామోదరద్వాదశిగా పేరుగాంచిన శ్రావణశుద్ధద్వాదశినాడు విష్ణుపూజ, విష్ణుసహస్రనామపారాయణం చేసి, విష్ణు ప్రతిమను దానం చేస్తే మంచిది. శ్రీమన్నారాయణమూర్తి వరాహరూపంలో అవతరించిన శ్రావణశుక్లత్రయోదశిరోజున వరాహస్వామివారికి పూజలు, అర్చనలు చేయడంవల్ల విశేషఫలితాలు కలుగుతాయి.

దైవీశక్తులతో కూడిన శ్రావణశుద్ధపూర్ణిమను రాఖీపూర్ణిమగా, జంధ్యాలపూర్ణిమగా జరుపుకుంటారు. శక్తిస్వరూపిణిగా వ్యవహరించబడే ఇంటి ఆడపడచు(సోదరి) చేత ఈరోజు రక్షాబంధనం కట్టించుకున్న సోదరులకు దేవతలు రక్షగా నిలిచి, అరిష్టాలను తొలగిస్తారనీ, అన్నింటా అండదండగా నిలుస్తారనీ విశ్వాసం. హయగ్రీవజయంతిరోజున సర్వవిద్యలకూ ఆధార భూతంగా ఉన్న శ్రీహయగ్రీవుణ్ణి స్తుతించడంవల్ల విద్యార్థులలో జ్ఞాపకశక్తి పెరిగి, గొప్ప విద్యావంతులవుతారు.

శ్రీకృష్ణపరమాత్మ ఆవిర్భవించిన దివ్యతిథే శ్రీకృష్ణాష్టమి. ఈ రోజున కృష్ణుణ్ణి అర్చిస్తే సకలపాపాలుపోతాయి. ధర్మార్థకామమోక్షప్రాప్తి, కార్యజయం కలుగుతాయి. ఇన్నివిశేషాలున్న శ్రావణలక్ష్మికి స్వాగతం...! సుస్వాగతం...!!



# మహాగణపతిం మనసాస్మరామి

- బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ

**శివుడు జ్ఞానమూర్తి- శక్తి ఆనందస్వరూపిణి. జ్ఞానానందాలు విడిగా ఉండవు. "అతని సంతతానందశక్తి ఆ సరసిజాక్షి" అని శ్రీనాథమహాకవిమాట. ఈ శివ శక్తుల ఏకతత్త్వమే గణపతి- అంటే- జ్ఞానానందసమాహారస్వరూపం. ఈ తత్త్వాన్నే వివిధఉపాసనాపద్ధతులుగా, కథలుగా, రూపాలుగా వివరించాయి - పురాణాది శాస్త్రాలు. గణపతి ఎక్కడ ఎప్పుడు ఎలా ఆవిర్భవించినా శివశక్తిమయుడుగానే వ్యక్తమవుతాడు.**

ఒకప్పుడు జగదంబ భండాసురునితో యుద్ధం చేస్తుండగా ఆ రాక్షసుని సోదరుడు విశుక్రుడు ఒక విఘ్నయంత్రాన్ని తయారు చేసి, ప్రయోగించాడని బ్రహ్మాండపురాణగాథ. ఆ యంత్రం పేరు 'జయవిఘ్నశిల'. దానిలో ఎనిమిది విఘ్నశక్తులున్నాయని ఆ కథ చెబుతోంది.

అవి 1) అలస(సోమరితనం), 2) దీన, 3) కృపణ (బేలతనం), 4) నిద్ర, 5) తంద్ర (కునుకుపాటు), 6) క్లీబ, 7) ప్రమీలిక, 8) నిరహంకార.

ఈ నామాల ఆంతర్యాన్ని పరిశీలిస్తే – ఈ శక్తులు ప్రగతికి అడ్డుతగిలే గుణాలేనని స్పష్టమౌతుంది. దీన్నిబట్టి పురాణకథలసంకేతవాదం మనకు చెప్పే గుణపాఠాలేనని తెలుస్తూంది.

ఏ కార్యరంగంలోనైనా పై ఎనిమిదిఅడ్డంకులు – కల్గుతూనే ఉంటాయి.

సోమరితనం, దిగులు, బేలతనం, నిద్ర, కునుకు, కర్తవ్యందాకా వచ్చే టప్పటికి వెనుదీయడం (క్లీబ), సంకోచించడం (ప్రమీలిక), "నావల్ల ఏమీ కాదు' అంటూ తనపై తనకు నమ్మకంలేనితనం– వ్యక్తిత్వవికాసానికి ఇవి శత్రువులు. వీటిల్ని ప్రయోగించగానే శక్తిసేనలు చైతన్యం కోల్పోయాయి. నిర్వీర్యమయ్యాయి.

మనలోనున్న అఖండఆత్మచైతన్యంవల్ల పనిచేసే అంతర్గతశక్తులే శక్తిసేనలు. అవి పై ఎనిమిది దుర్గుణాలవల్ల స్తంభించబడడమే ఈ గాథలోని ఆంతర్యం.

ఆ సమయంలో అమ్మవారు (లలితాదేవి) పరమేశ్వరుణ్ణి చూచి, ఆ దర్శనం వల్ల కలిగినస్పందనతో మందహాసం చేసిందట. వెంటనే ఆ మందహాసతేజం నుండి గణపతి ఆవిర్భవించాడని ఆ పురాణకథ.

శివశక్తిస్పందనవల్ల కలిగిన ఒక ఆనందచైతన్యమే విఘ్నేశ్వరుడు. అదే "నవ్వు" నుండి ఉద్భవించడంలోని ఉద్దేశం.

అలా వెలువడ్డ మహాగణపతి అవలీలగా విఘ్న యంత్రాన్ని పిండి చేశాడు. ఎనిమిదివిఘ్నశక్తుల్నీ సంహరించాడు. – ఈ ప్రాచీన గాథలోని గొప్పభావాల్ని పరికిస్తే గణపతి భావం అవగతమౌతుంది.

జ్ఞానానందశక్తినుండి ఉత్సాహం, కార్యశీలతవంటి దివ్యశక్తులు కలుగుతాయి. ఇవి ఎలాంటి విపరీతాలనైనా

**2017, ఆగష్టు 25 తేది వినాయక చవితి సందర్భంగా..**

**ధర్మగతికీ, దేవకార్యాలకూ ఆటంకాలు ఎదురై, జగత్‌స్థితికి అవరోధాలు కలిగినప్పుడు ఆ విఘ్నాలను పరిహరించడానికై పలురూపాలతో వినాయకుడు ఆవిర్భవించినట్లుగా ఎన్నో కథలున్నాయి. అందుకే ఆ స్వామికి ఎన్నో అవతారాలు!**

తొలగించి, సిద్ధిని ప్రసాదిస్తాయి. తేటపడ్డ సారాంశం- గణపతి ఆనందరూపుడు. సంతోషాన్ని ప్రసాదించడమే ఆయన అనుగ్రహం.

హాస్యరసానికి గణపతిని అధీశునిగా చెప్పడంలోనూ ఇదే ఆంతర్యం. అలాగే 'మోదకం' ఆయనకు నైవేద్యం అనడంలోనూ ఇదే భావం. ఆమోదం, ప్రమోదం, బుద్ధి, సిద్ధి, పుష్టి, తుష్టి, కాంతి, సుముఖ (మంచిపనులకు అనుకూలత), దుర్ముఖ (చెడు పట్ల విముఖత)..... ఇవన్నీ గణపతి శక్తులు.

'మోదం' అంటేనే ఆనందం.

ఒక కార్యం ప్రారంభించేటప్పుడు "భయం, సంశయం, సంకోచం, ఉద్వేగం" వంటి వికారాలు లేకుండా ఉత్సాహంగా, 'తప్పక సిద్ధి లభిస్తుంది? అనే సకారాత్మక భావనతో కూడిన ఆనందాన్ని 'ఆమోదం' అనవచ్చు. సిద్ధి కలిగాక లభించే ఆనందాన్ని 'ప్రమోదం' అని భావించవచ్చు. ఆనందపు ఈ రెండు భావాలే గణపతి శక్తులు. 'పూర్ణ'త్వానికి సంకేతాలుగా మోదకాలు, ఉండ్రాళ్లు, లడ్లు వంటివి గణపతికి నైవేద్యాలుగా ఆయన వలన మనకి ప్రసాదాలుగా లభిస్తాయి. పరిపూర్ణానంద తత్త్వమే గణపతి స్వరూపం. ఆ అనుభవమే మనకు ప్రసాదం, పంచభూతాల్లో భూమియందున్న ఈశ్వరశక్తిని గణపతిగా ఆరాధించడం మరొక శాస్త్రకథనం.

ఈ పృథ్వీతత్త్వంలోని చిచ్ఛక్తినే 'మూలాధారశక్తి'గా యోగశాస్త్రం చెబుతోంది. ఈ 'మూలమై'న చక్రానికి అధిష్ఠానం గణపతి. యోగపరంగా ఆదిదైవమితడే. ఈ భూతత్త్వప్రతీకగానే మట్టితో స్వామిప్రతిమను చేయడమనే సంప్రదాయం వచ్చింది. ఈ పుడమిలోనే మిగిలిన నాలుగు భూతతత్త్వాలు లీనమై ఉన్నాయి. ఈ భూమిపై, భూమివల్ల- పార్థివశరీరంతో బ్రతికే మనం, ఈ తత్త్వం లోనే ఈశ్వరతత్వాన్ని ఆవిష్కరించుకోవాలి. ఆ ప్రక్రియే గణపతి ఉపాసన.

వేదాంతపరంగా.... బ్రహ్మజ్ఞానాన్ని గ్రహించకుండా అడ్డుకునే 'వక్ర'మైన మాయాశక్తే 'విఘ్నం'. దాన్ని తొలగించి, తన పరతత్త్వాన్ని ప్రత్యక్షం చేసే విఘ్ననాశకుడు, మాయకి నాయకుడు విఘ్నేశ్వరుడు.

అతడు సచ్చిదానందమూర్తి, నిర్మలమైన, పూర్ణమైన అఖండానందాన్నే తన స్వరూపంగా వ్యక్తం చేస్తున్న గణేశునికి వందనం.

మహాగణపతి నవరాత్రుల పర్వం. నవసంఖ్య పూర్ణత్వ సంకేతం గనుక, ఒక దేవతాశక్తిని పూర్ణంగా గ్రహించేందుకే ఈ తొమ్మిదినాళ్ల ఉత్సవాలు.

**వినాయకునిగా, గణపతిగా, ఏకదంతునిగా, వక్రతుండునిగా పలు పేర్లతో పూజలందే గజాననుడు ఆబాలగోపాలానికీ ఆదరపాత్రుడు.**

విఘ్నసంహారానికి అవతరించిన పరబ్రహ్మయే గణపతి. సృష్టికి పూర్వమే బ్రహ్మకు విఘ్నాలు కలిగినప్పుడు, బ్రహ్మ ఓంకార ధ్యానం చేయగా, ఆ ఓంకారమే వక్రతుండస్వరూపంగా సాక్షాత్కరించి విఘ్నాలను తొలగించింది. ఆ ప్రణవతేజమే, అటు తర్వాత పార్వతీపరమేశ్వరుల పుత్రునిగా ఆవిర్భవించింది. శివశక్తుల సమైక్య తత్త్వం, ప్రకృతీపురుషుల ఏకత్వం వినాయకమూర్తిలో ద్యోతకం. శరీరం తల్లి సమకూర్చింది, గజశిరస్సు తండ్రి అమర్చింది. ఇలా ఈ రెండింటి కూర్పు శివశక్త్యాత్మకతత్త్వం, నరశరీరం జగత్తుకు సంకేతం, గజశిరస్సు పరమేశ్వరతేజస్సుకు ప్రతీక.

ఈశ్వర జ్ఞానం (శిరస్సు)తో, నడిచే జగం. ఈ రెండూ కలసిన విశ్వరూపమే వినాయక స్వరూపం. 'ప్రణవ స్వరూప వక్రతుండం వాతాపి గణపతిం' అని ముత్తుస్వామిదీక్షితులవారి కృతి. కాలమే విఘ్నం అని ఉపనిషద్వచనం.



**"అనుకూలత - ప్రతికూలత" అనేవి కాల లక్షణాలు.**
**ప్రతికూలతను తొలగించి అనుకూలతను కలిగించే కాలరూప ఈశ్వర చైతన్యమే విఘ్నేశ్వరుడు.**

**మంచిపనులకు విఘ్నాలను తొలగించి, చెడుపనులకు విఘ్నాలను కలిగించే విఘ్న నియామకుడు 'వి-నాయకుడు'.**

అనుకున్నదానికి విఘ్నం ఏర్పడ్డప్పుడు, తాత్కాలికంగా "అయ్యో అనిపించినా, అటుపై కొన్నాళ్లకు ఆ విఘ్నం మేలుకే జరిగిందని తెలియవచ్చు. ఒకనికి అనుకోనివిఘ్నమేర్పడి, ఎక్కవలసిన బస్సో, రైలో, విమానమో తప్పిపోవచ్చు. తరువాత ఆ వాహనానికి ప్రమాదం జరిగిందనే వార్త తెలిస్తే, 'ఆ వాహనాన్ని ఎక్కకుండా ఆపినవిఘ్నం వరమయ్యిం"దని అర్థమౌతుంది. అలా అశుభానికి విఘ్నం కలిగించి, శుభాలకు విఘ్నాలను తొలగించేస్వామి– వినాయకప్రభువు.

అదేవిధంగా – 'గణపతి', 'గణేశ నామాలుకూడా ఎంతో జ్ఞానాన్ని బోధిస్తాయి. ఈ ప్రపంచమంతా గణాలతో (సమూహాలతో) కూడుకున్నదే! అనంతవిశ్వాన్ని చూస్తే– ఇందులో ఎన్నోగణాలు– నక్షత్రగణాలు, గ్రహగణాలు, వాయువులగణాలు ఉన్నాయి. గ్రహాలలో భూమి ఒకటి. ఆ భూమిలో మళ్లీ ఎన్నో గణాలు! వృక్షగణాలు, నదీగణాలు, పర్వత గణాలు, పక్షిగణాలు, జంతుగణాలు, మనుష్యగణాలు! అందులో మళ్లీ వృక్షాలను గణిస్తే అందులో ఎన్నోగణాలు! మామిడి, అశోక, మద్ది. ఇలా ఎన్నో అందులో మళ్లీ గణాలు! మనుష్యుల్ని చూస్తే స్త్రీ పురుషుల గణాలు ఒక విభజన. ఇంకా పదవులు, ప్రాంతాలు, గుణాలు, స్వభావాలు, వృత్తులు, కళలరీత్యా ఎన్నోగణాలు! ఇలా సృష్టి అంతా విభిన్నతలే! ఇవన్నీ అవసరమే! అయితే విభిన్నవిభిన్నాలుగా ఉన్న ఈ గణాలన్నింటిలో ఒకే పరమేశ్వరచైతన్యం ఉంది. అదే 'ఈశ' లేదా, 'పతి'. అన్నిగణాలలోనూ పతి ఒకడే! గణాలలో భేదమున్నా పతిలో భేదం లేదు.

## భిన్నత్వంలో ఏకత్వమే గణపతితత్త్వం

దేవతాగణాలలో, మంత్రగణాలలోకూడా ప్రభువు అతడే. 'ఏకం సత్', 'ఏకం పరబ్రహ్మ', 'ఏకం దైవతం'–అని వేదాంతం ప్రవచించినట్లుగా అన్నిటా వ్యాపించిన ఏకచైతన్యమే గణేశుడు.

విశ్వమే అనేకగణాలతో కూడిన మహాగణం. విశ్వనాయకుడే మహా గణపతి.

మన శరీరంలోకూడా ఇంద్రియగణాలు, ఉపగణాలు, గుణగణాలు ఎన్నిఉన్నా– అంతా కలిపి ఒకే 'నేను' అనే ఆత్మచైతన్యం ఉంది. ఇది అందరిలో వ్యాపించిన అంతర్యామితత్త్వం! ఈ తత్త్వమే మన భిన్నఇంద్రియాలకు 'నేను' అనే ఐక్యతనిచ్చి ఆపాదమస్తకమూ ప్రకాశిస్తోంది. ఇదే 'పతి'.

ప్రపంచంలో శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలను ఇంద్రియగణాల ద్వారా స్వీకరించి, హృదయమనే చిన్ని కలుగులో రహస్యంగా అనుభవించే జీవుడే మూషికం. 'ముష్' అనే ధాతువుకు 'చోరత్వం' అని అర్థం.



ఆశతో ప్రాపంచికసుఖాల్ని ఎవరికీ కానరాకుండా హృదయంలో అనుభవించే మనజీవచైతన్యం పరిమితమైంది. అతి చిన్నది. దీన్ని అధిష్ఠించిన మహోన్నతఅపరిమితపరమాత్మచైతన్యమే – మూషికవాహనారూఢుడైన గణపతి.

ఇలా గణపతిఆరాధనలో ఎన్నెన్నో తాత్త్వికమర్మాలు దాగి ఉన్నాయి. బీజం మొలకెత్తి ఫలం లభించేదాకా కల్గే అన్ని విఘ్నాల్ని తొలగించే అనుగ్రహస్వరూపుడు గణనాథుడు.

అన్నిగణాలను శాసించేవాడు కనుక, ఈయనను ఆరాధించేవారికి అన్నింటా అను కూలమే!

*నమస్తే గణపతయే.*





స్వార్థపరతకన్న చావు లేదు

# ధరణిని బ్రోచిన వరాహరూపా నారాయణ....

- శ్రీ మేళ్ళచెఱువు ప్రవీణ్‌కుమార్



*2017, ఆగస్టు 24 తేది శ్రీవరాహజయంతి సందర్భంగా..*

భగవంతునిలీలల్లాగానే భగవంతునిరూపాలుకూడా అనంతాలు, అద్భుతాలు. ఒక రూపం ఉచ్ఛమైందని కానీ, ఒక రూపం నీచమైందని కానీ భావించడానికి వీలులేకుండా, భగవంతుడు అతిచిన్నరూపాలలోనూ, అతివిరాట్‌రూపాలలోనూకూడా తనఉనికిని ప్రదర్శించి, తనమహిమలను చాటి, తనపై భక్తులు పెట్టుకున్న భక్తివిశ్వాసాలకు ప్రతీకగా– దుష్టశిక్షణ ధ్యేయంగా ప్రతియుగంలోనూ అవతరిస్తున్నాడు. భాగవతం మొత్తం తెలిపే సారాంశం ఇది.

అతి చిన్నమీనంలోనూ, జలచరం, భూచరం అయిన కమఠం (తాబేలు)లోనూ శ్రీమహావిష్ణువు తనదివ్యరూపాన్ని, దివ్యమహత్తును చూపాడు. చీమ నుండి బ్రహ్మాండంవరకు సకలజీవరాశుల్లోనూ తాను నిండి ఉన్నాడని ఋజువు చేసుకున్నాడు. కొన్నిసన్నివేశాల్లో "సూకరరూపం"లో "యజ్ఞ వరాహమూర్తి" అయి, పాతాళానికి క్రుంగిపోయిన భూమిని ఉద్ధరించాడు. భూమిని ఉద్ధరించడానికి ఆ యజ్ఞవరాహుడు సాగరాన్ని తనవాడికోరలతో చీల్చుకుంటూ రసాతలానికి చేరుతాడు. తన దంష్ట్రాగ్రాలమీద భూగోళాన్ని స్థాపించి, శంఖచక్రగదాహస్తుడైనశ్రీహరి వరాహరూపంలో మహాద్భుతంగా రసాతలం నుంచీ పైకి వస్తున్నాడు.

ఆ సమయంలోనే "హిరణ్యాక్షుడు" అనేరాక్షసుడు, యుద్ధకాంక్షతో, "వరుణుడి"మీదకు యుద్ధానికి వెళతాడు. ఆ రాక్షసునిబలపరాక్రమాలు తెలిసిన వరుణుడు, వాడితో తాను యుద్ధం చేయలేనని "వైకుంఠంలో ఉన్న శ్రీమన్నారాయణుడే నీకు సమఉజ్జీ" అని చెబుతాడు. హిరణ్యాక్షుడు వైకుంఠంవైపు యుద్ధోన్మాదంతో పరుగుతీస్తుంటాడు. ఆసమయంలో నారదుడు అతనికి ఎదురౌతాడు. "శ్రీహరి వైకుంఠంలో లేడు. యజ్ఞవరాహరూపంతో సాగరగర్భంలో ఉన్నాడు." అని చెప్పి, ప్రోత్సహించి, పురికొల్పి మరీ మృత్యుముఖంవైపు వాణ్ణి పంపుతాడు. ఇక హిరణ్యాక్షుడు యజ్ఞవరాహమూర్తిని వెక్కిరిస్తూ యుద్ధానికి తలపడతాడు. యజ్ఞవరాహమూర్తికూడా ఆ రాక్షసునితో యుద్ధానికి సిద్ధపడతాడు.

వారిద్దరిపోరు మహాద్భుతంగా జరుగుతుంది. బ్రహ్మాది దేవగణమంతా ఆ యుద్ధాన్ని చూస్తుంటారు. ఆ రాక్షసునిచేత





హింసించబడ్డ దేవ, గంధర్వ, యక్ష, కిన్నర, కింపురుష, సిద్ధ, చారణగణమంతా ఆ భీకరపోరాటాన్ని చూస్తూ "వీణ్ణి హతమార్చు స్వామీ!" అంటూ వేడుకొంటారు.

మహాద్భుతంగా జరిగిన వారిరువురి భయంకర యుద్ధంలో శ్రీవరాహమూర్తి, హిరణ్యాక్షుణ్ణి హతమార్చి భూమిని తన దంష్ట్రాగ్రాలమీద నిలిపి నిల్చుంటాడు.

ఆ రూపంతో నిల్చిన యజ్ఞవరాహమూర్తి దివ్య రూపం నాటికీ, నేటికీ విష్ణుభక్తులహృదయాలలో శాశ్వత ముద్ర వేసుకుంది.

ఒక దుష్టుడు లోకానికి అపకారం చేస్తూ, సాధు జనులను హింసిస్తూ, వీరగర్వంతోనూ, తపోగర్వంతోను ఆజేయుడై నియంతృత్వధోరణిలో కొనసాగుతున్నప్పుడూ, ఆ దుష్టుణ్ణి ఎదిరించే శక్తిలేనిబలహీనుల ఆర్తనాదాలు, బలం ఉన్నా వాడియోగబలం, తపోబలం, వరబలంముందు తమబలం పనికిరాక బలవంతులు నిస్తేజులై భగవంతుణ్ణి శరణు జొచ్చినపుడూ, ఈ సృష్టిని సక్రమంగా పాలించడానికీ, నడిపించటానికీ, దుష్టశిక్షణ, శిష్టరక్షణచేసి, ఆర్తులను కాపాడటానికీ, ధర్మాన్ని పునరుద్ధరించటానికీ భగవంతుడు తప్పనిసరిగా అవతరిస్తాడు. అవతరించితీరాలి అది ఏ రూపమైనా కావచ్చు.

అలా హిరణ్యాక్షుడనే దానవుణ్ణి చంపటం, భూమిని ఉద్ధరించటం అనే రెండుకార్యసాధనాలద్వారా (దుష్టశిక్షణ, శిష్టరక్షణ) ఒక వరాహరూపం ఆదివరాహరూపంగా, యజ్ఞ వరాహంగా, దైవంగా రూపు సంతరించుకుంది. భక్తుల విశ్వాసానికీ భక్తికీ ప్రతీకగా నిల్చింది.

బ్రహ్మాదిదేవతలు ఆ మూర్తిని స్తుతించారు.

సీ॥ దేవ జితం జితం తే పరమేశ్వర!
జిత యజ్ఞభావన! శ్రుతిశరీర!
యనుచు కారణసూకరాకారుడగు నీకు
నతిభక్తి మ్రొక్కెద మయ్య వరద
భవదీయరోమకూపములందు లీనంబు
లైయుండు నంబుధు; లట్టి యధ్వ-
రాత్మకమై తనరారు నీరూపంబు
కానంగ రాదు దుష్కర్మపరుల
తే॥ కట్టి నీకు ప్రణామంబు లాచరింతు మఖిలజగదేకకీర్తి! దయానువర్తి!
భవ్య చారిత్ర! పంకజపత్రనేత్ర! చిరశుభాకార! ఇందిరాచిత్తచోర!



# విష్ణుపారిజాతం

శ్రీవేంకటేశ్వరస్వామి నామమే శ్వాసగా, ధ్యాసగా జీవిత పర్యంతం మెలగిన భక్త కవయిత్రి తరిగొండ వేంగమాంబ. ద్విపద వాఙ్మయానికి ఆకృతిగా, సంకీర్తనలకు శ్రుతిగా రూపుదిద్దుకున్న దక్షిణాదిభక్తిపారిజాతం ఆమె.

వేంగమాంబరచనల్లో 'విష్ణుపారిజాతం' అనే యక్షగానం విలక్షణ మైంది. ఇందులో శ్రీకృష్ణుడు నాయకుడు. సత్యభామ ప్రధాననాయిక. శ్రీకృష్ణుడు సత్యభామకోసం అమరలోకంలోని పారిజాతాన్ని తీసుకురావడం ఇందులోని కథ.



యక్షగానకథానాయకుడు శ్రీకృష్ణునికీ, తిరుమల శ్రీనివాసునికీ వేంగమాంబ అభేదాన్ని పాటించింది. ఇందులో సతీసమేతుడైన శ్రీకృష్ణపరమాత్మను చెలులు ఆనందంతో కొనియాడిన సువ్విపాట సుప్రసిద్ధమైంది.

పరమధర్మానుగుణ్య - భక్తసంతతిశరణ్య -సురుచిరామరాగ్రగణ్య - సువ్విలాలీ
విమలపరమపదవిహార- వేదవేదాంతసార -సుమహితాంబునిధిగభీర-సువ్విలాలీ

ఈ యక్షగానంలోనే శ్రీకృష్ణుని వివాహగాథలు వర్ణించబడ్డాయి. తెలుగుదనం మూర్తీభవించిన యక్షగాన మిది.

– డా॥ సంగీతం కేశవులు

*(గతసంచిక తరువాయి భాగం...)*

నూటెనిమిదిదివ్యదేశాలను, ఆ దివ్యదేశాలలోని అర్చామూర్తులగురించి విష్ణు చిత్తులవారు చెబుతుంటే – తండ్రీ? రంగనాథుల చరిత్రలు ఇంకా వినాలనిపిస్తుంది. దయతో వినిపించండి' అని గోదాదేవి అడిగింది.

అమ్మా! గోదా! తప్పక చెబుతాను. ఒకసారి బ్రహ్మ క్షీరసాగరనాథుణ్ణిమనసులో నిలుపుకొని తపస్సు చేశాడు. స్వామి బ్రహ్మతపస్సుకు మెచ్చాడు. అనేకానేకశాఖలతో కూడి, వేదాలలాగా శిఖరాలు కలదీ, ఓంకారాత్మకమయిందీ అయినవిమానంతో శేషశాయిగా స్వామి ప్రత్యక్షమయ్యాడు.

బ్రహ్మ సంతోషించాడు. ఆ విమానంతో సత్యలోకానికి వెళ్ళాడు. తగినచోట విమానం ప్రతిష్ఠచేశాడు. వివిధోపచారాలతో పూజలు చేశాడు. సత్రయాగం మొదలెట్టాడు. దేవతలు, తాపసులు అక్కడికి చేరుకున్నారు. వారితో సూర్యవంశజుడయిన ఇక్ష్వాకుడూ వెళ్ళాడు. అక్కడ జరిగే యాగాలు చూచి, ఆశ్చర్యపడ్డాడు. అక్కడి విమానాన్నీ, విమానంలోని రమాపతినీ దర్శించారు. అతనిమనస్సులో తళుక్కుమని ఒక ఆలోచన మెరిసింది.

'స్వామీ! నిన్ను నా ఇలువేల్పుగా సేవిస్తాను. అనుగ్రహించండి' అన్నాడు – బ్రహ్మతో. ఆపై భూలోకానికి వచ్చి, అతిఘోరతపస్సు చేశాడు. శ్రీపతి కనికరించి ప్రత్యక్షమయ్యాడు. విమానాన్ని తెచ్చి, అయోధ్యలో పవిత్రంగా ప్రతిష్ఠించి, సేవించడం




మొదలెట్టాడు. అతనిలాగే అతనివంశస్థులు ఇలువేల్పుగా సేవించేవారు. దశరథుని కాలందాకా రంగపతిది అయోధ్యవాసమే!

శ్రీరాముడు జన్మించి, రావణుణ్ణి హత మార్చి, అయోధ్యకు మరలి, తనకు విభీష ణుడు చేసిన ఉపకారాన్ని మరచిపోకుండా ఆ విమానాన్ని విభీషణుని కిచ్చాడు. విభీష ణుడు సంతోషించి, విమానంతో లంకకు కదిలాడు.

మధ్యాహ్నమైంది. సంధ్యావందనం కోసం కావేరీతీరంలో విభీషణుడు విమానం పెట్టాడు. సంధ్యాదివిధులు పూర్తిచేసుకొని, ఆ తరువాత 'విమానాన్ని' ఎత్తడానికి ప్రయ త్నిస్తే కదలలేదు. విభీషణుడు దిగాలు పడ్డారు. శ్రీరామచంద్రులవారిచ్చిన విమా నాన్ని కాపాడుకోలేకపోయా నని పరి తపిస్తుంటే– స్వామి ఆతనిదైన్యాన్ని చూచి, అశరీరవాణిరూపంలో –

'విభీషణా! బాధపడతావెందుకు? బాధ పడవద్దు. ఈ కావేరీతీరం నాకు నచ్చింది. చంద్రపుష్కరిణితీరంలో ఈ విమానం ఉంచు. ఇక్కడ తపస్సు చేసేవారిని కాపా డడంకోసం, నవతీర్థాలతోడి ఈ ప్రదేశాన్ని మన్నించడంకోసం లంకకేసిచూస్తూ, శేష శయ్యపై పడుకొని, యోగనిద్రలో దర్శన మిస్తాను. భయపడకు' అన్నాడు.

తదనంతరం విభీషణుడు లంకకేసి వెళ్ళారు. అప్పటినుండి రంగపతి చంద్ర పుష్కరిణీనదీతీరంలో సాక్షాత్కరించి, భక్తుల్ని కాపాడుతున్నాడు. ఆ స్వామే నిచుళా పురిలో 'పద్మినిని' పెళ్ళాడి 'సౌమ్యజామాత' అయ్యాడు.

'నవగ్రహాలలో సూర్యచంద్రులలాగా 'నవరంగాలు' ఇక్కడే ఉన్నాయి. ఆ విభుని విహారసౌధాలే 108 దివ్యతిరుపతులు. ఆ స్వామిమహిమ అవాఙ్మానసగోచరం' అని





తం(డి శ్రీరంగనాథులమహిమలు, కథలు చెబుతుంటే 'నీలవేణి' గోద మైమరచింది.

సూర్యకిరణాలకు సంతృప్తిపడే పద్మంలాగా పులకించింది. ఆ రంగవిభుణ్ణే ధ్యానిస్తూ సర్వస్వం స్వామే అని భావిస్తూ తం(డితో–

'జనకా! భూలోకవాసులైన కన్యలకు శ్రీపతిని పతిగా వరించేందుకు ఏ ఉపాయమయినా ఉందా? చెప్పరా?' అని (ప్రార్థించింది. అపుడు విష్ణుచిత్తులవారు–

'కల్యాణీ! గొల్లెతలు శ్రీకృష్ణవ్యామోహంతో మార్గశీర్ష (వ్రతం చేశారు. ఆ (వ్రతం చేస్తే 'శ్రీవధూనాయకుడు' పతిగా ఏలుకోవడం తథ్యమన్నాడు. అమ్మా! నీవు ఈ (వ్రతం చేస్తే తప్పక స్వామి ఏలుకొంటాడు, అని తనసమ్మతిని తెలియజేశాడు.

గోద 'ఆ (వ్రతాచరణానికి సిద్ధమైంది. రంగమందిరం చేరింది. ఆ నోము తా నోము ఆ నోము'గా తానే గోపిక అయింది. ముప్పదిపాశురాలతో ఒక (ప్రబంధం పాడింది. నూటనలభై పాటలతో మరో (ప్రబంధం గానం చేసింది. అప్పటి నుండి సర్వం గోదకు శ్రీరంగమయింది.

ఆమెకు కనబడిందల్లా కావేరి, దర్శించినకొలనులంతా చం(ద్రపుష్కరిణి, దృగ్గోచరమయినవి(గ్రహాలు శ్రీరంగస్వామి చూపులతోనే (ప్రతిగృహం విమానం.

'రంగనాథుడు సం(ప్రీతితో నన్నేలు కొంటాడా? పాణి(గ్రహణం చేస్తాడా? నన్ను చేరదీసి, నా జవ్వనాన్ని సార్థకం చేస్తాడా?' అంటూ పూసెజ్జపై పడుకొని నిదురపోయింది.

ఆ నిదురలో శ్రీరంగనాథుడే వచ్చాడు. గోదాదేవిని అలరించాడు. ఆనందంలో ముంచెత్తాడు. గోదాదేవికూడా ఆ దేవునితో గడిపినట్లుగానే భావించింది. ఆ భావన 'గోదాదేవి' ఊరుకో నివ్వలేదు. నానాయాతనలు పెట్టించింది. హారం మీద, ఆహారంమీద ఆరామకేళీవిహారాలపై (ప్రభావం చూపింది. మదనబాధ మనసును ఊరుకోనివ్వలేదు. అయినా తన స్థితిని తల్లితం(డులు తెలుసుకొంటారేమోనని భయపడింది.

కమలాక్షునికి శ్రీరంగనాథునికి వింజామరలు విసిరే వారిలో 'అను(గ్రహ' ఒకతె. అను(గ్రహ తనచెలికత్తెలో మనుజ కన్యావేషంతో గోదాదేవిని సేవించేది. ఆమె గోదాదేవితో



వనవిహారానికి వెళ్ళింది. అయినా 'గోదకు' ఆ పరిసరం ఉపశాంతి ఇవ్వలేదు. విన ఇంపైన నెమళ్లకూతలు ఆమెకు 'హాలాహలం' పుట్టినట్లు చెవులచిల్లులు పొడిచాయి. చెలులిచ్చే కలువపూలు బాణాలుగా తాకడానికి దడ పుట్టించాయి. విరుల తేనెలు మన్మథపీడిత 'చేతి' రక్తాలుగా కనిపించాయి. తన్ను కాళింది మొదలయిన 'గోపకాంత'లలాగా భావించుకొంది. గోపికల చీరెలపహరించినవాడు, పొన్నచెట్టులో దాక్కొన్నవాడు అయిన కృష్ణుడు చెట్టుమీదున్నవాడని 'మాకు చీరలివ్వవా' అంటూ బతిమాలింది.

'కృష్ణా! ఎపుడు మరల నీవు వస్తావని' ఎదురుచూచేది. 'జానకీచ(క్రం' చూచి, సంబరపడేది. గండుకోయిలలు కూస్తే మంచి శకునమని మురిసేది. భావజవిలాసంతో గోదాదేవి తలమునకలవుతూ శ్రీరంగపతిని పెళ్ళాడినట్లు (భ్రమించేది. ఈ రకంగా ఆ (భ్రమతో గోద (ప్రలాపించేది. *(ఇంకా ఉంది)*



# గోవు మాలక్ష్మికి.. కోటిదండాలు...!

- డా॥ కె. రవిచంద్రన్

పచ్చతోరణం

**అ - అమ్మ; ఆ - ఆవు; ఇ - ఇల్లు; ఈ - ఈశ్వరుడు...**

**చిన్ననాడు మనం చదివిన తెలుగువాచకం చక్కగా చెప్పే మాటలివి. అమ్మ తర్వాత ఆవుకే ప్రాధాన్యతనిచ్చే పలుకులివి. ఇంకా చెప్పాలంటే ఈశ్వరునికంటే ముందుగానే గోమాతకు తగుస్థానమిచ్చిన వైనమది. నిజమే, దేవునికంటే ముందే గోవు. గోవులు నడుస్తుంటే వాటివెనుక గోవిందుడుంటాడు కదా. వాటిని కాచుకుంటాడుకదా. వాటిని లాలించి పాలిస్తాడుకదా. అందుకే గోసంతతికి మనధర్మంలో అంతటి విలువచేకూరింది. ఆవు అనగానే మనందరిలోనూ అలవిమాలిన ప్రేమ పొంగిపొరలేదీ ఇందుకేనేమో!**

## గావో విశ్వస్యమాతరః

గోవు సమస్తవిశ్వానికి తల్లి. మనకు బ్రహ్మ ప్రాణం పోస్తే, అమ్మ జన్మ నిస్తే, ఆవు తనపాలతో కాపాడుతుంది. ఆ పరమాత్ముడు తనబదులుగా అమ్మను సృష్టించాడంటారు. అదేవేళలో అమ్మమ్మలాంటి గోమాతనూ మనకు అందించాడు. ఈ తల్లి మానవాళికి ఒకవరం! దైవప్రసాదం! అమృతోపమానం!

ఇప్పటికాలంలో ధనమంటే కాసులు, కరెన్సీకట్టలే కావచ్చు. కానీ, ఒకప్పటి ఆర్యావర్తంలో సంపద అంటే గోసంపదే! సొమ్ము అంటే నాటిభారతీయులదృష్టిలో రూకలు కాదు. ఆవులే! గోగణమే! పశుసమూహమే! నాటికాలంలో ఎన్ని గోవులుంటే అంతటి ధనవంతుడన్నమాట! మహాభారతంలోని విరాటపర్వంలో ఉత్తరగోగ్రహణఘట్టం గుర్తుతెచ్చుకుంటే చాలు- గోసమూహం అమూల్యమన్న సంగతి ఇట్టే బోధపడిపోతుంది. అంతెందుకు? ఆవులు కనిపించకపోతే "సొమ్ములు పోనాయండీ" అంటూ నిన్నమొన్నటివరకూ జానపదులు గగ్గోలు పెట్టిన ఉదంతాలూ మనకు విదితమే!



ప్రాచీనభారతీయసంస్కృతీసంపదలకు ప్రత్యక్ష ప్రతీక గోమాత. భారతీయులకు అనాదినుంచీ ఆరాధ్యదేవత. అన్నాన్ని ఉత్పత్తి చేసేవి గోవులే నని ఆర్యులు శ్లాఘించారు. ఈ జగత్తులో గోసంపదతో సమానమైన ధనసంపదను చూడలేమని చ్యవన మహర్షి 'నహుషం'లో ప్రవచించారు. చతుర్వేదాలలోనే కాక, ధర్మశాస్త్రగ్రంథాల్లోనూ, భారత, రామాయణ, భాగవతాల్లోనూ గోమహిమ అసమానమైందిగా అభివర్ణించారు- మన పెద్దలు. వాల్మీకి, వ్యాసుడు, ఆదిశంకరుడు, తులసీదాసు, కబీరు, మహాత్మా గాంధీవంటి ప్రముఖు లందరూ గోవులవిశిష్టతనూ, వాటి రక్షణావశ్యకతనూ తెలియజేశారు. శ్రీకృష్ణభగవానుడు స్వయంగా గోమాతను సేవించి, గోపాలుడయ్యాడు. కలియుగవైకుంఠమని పేరుగాంచిన తిరుమలగిరులపై కొలువైన ఆ వేంకటేశ్వరుడు పుట్టలో ఉన్నప్పుడు బ్రహ్మదేవుడే ఆవురూపంలో వచ్చి, పాలు ఇచ్చినసంగతి మనకందరికీ ఎప్పటికీ గుర్తుంటుంది. దిలీప చక్రవర్తి ఆవులకోసం తనప్రాణాలను త్యాగం చేసేందుకు సైతం వెనుకాడలేదు. జమదగ్ని గోరక్షణకై ఆత్మత్యాగం చేశాడు కూడా!

## ఆవుతో అనుబంధం....

మనకు 'తెలుగు'వారనే పేరు రావడానికి కారణమూ ఆవు అంటే ఆశ్చర్యం కలుగవచ్చు. ఇది నిజమేనని భాషాశాస్త్రం

చెబుతోంది. "సరసా స్తిలవ ద్గావో.... యత్ర సన్తి సహస్రశః సదేశ స్తిలగుర్నామ." అనేది అందుకు ప్రమాణవాక్యంగా చూపుతోంది. తిలలు అంటే నువ్వులు. నల్లనినువ్వులవలే ఉండే గోవులు శ్రేష్ఠమైనవంటారు.

'గోవులలోపల కపిల బహుక్షీర' అని చిన్నయసూరి బాలవ్యాకరణంలో రాశాడు. తిలలవంటిగోవులు వేలాదిగా ఉన్న ఈ ప్రదేశం పూర్వం 'తిలగు' అని పిలువబడేదనీ, ఆ 'తిలగు' శబ్దంనుండే 'తెలుగు' శబ్దం ఉత్పన్నమైందనీ శాస్త్ర కారులు వివరణ ఇస్తున్నారు. అలా మనం నిజమైన తెలుగువాళ్లం కావాలంటే గోవుల్ని ఆంధ్రదేశమంతటా పోషించి, వృద్ధి చేయాలి. భారతీయశ్రుతిస్మృతిపురాణాలన్నీ గోవును పలు విధాల స్తుతించినవే! గోమాతకీర్తనం, దానం, ధర్మం, గోరక్షణం, గోరక్షణప్రోత్సాహం, గోరక్షణప్రోత్సాహకప్రేరణం – ఈ కార్యాలన్నీ పుణ్యప్రదమైనవే!



## ఆజన్మాంతం.....

గోవులతో మనబంధం బతికున్నంతవరకే కాదు. మరణించిన తరువాతకూడా పెనవేసుకునే ఉంటుంది. ప్రతి జీవునికీ మరణం తప్పదు. దేహం చాలించాక ఇహలోకంలో చేసిన పాపపుణ్యాల్ని బట్టి, పరలోకంలో స్వర్గనరకలోకాల ప్రాప్తి ఉంటుంది. ఈ లోకంలో తనువు చాలించినవారు



## స్వర్గ సోపానాలు...

**గోమాతయొక్క స్వస్వరూపం మన చైతన్యం యొక్క స్వస్వరూపం, గోమాతరూపం మధురానుభూతి నందివ్వగల దివ్యమంగళస్వరూపం. ఆవులోనే అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళ, భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనోలోక, తపోలోక, సత్యాఖ్య లోకాలున్నాయంటుంది-వేదం. అంటే గోవు విశ్వపృథ్వీరూపమన్నమాట! కురుక్షేత్ర సీమలో పాండవమధ్యమునికి భగవద్గీత బోధిస్తూ, శ్రీకృష్ణుడు స్వయంగా నేనే గోవు నని చెప్పాడు. అందుకే శ్రీకృష్ణుడికి గోపాలుడు అని పేరొచ్చింది. గోసంరక్షణకోసం ఏకంగా కృష్ణుడు గోవర్ధన గిరినే చిటికిన వేలిపై మోసి, ఆవుల్ని కాపాడాడు. శ్రీసూక్తం, పురుషసూక్తం, మన్యు సూక్తంలాంటి పవిత్రసూక్తాలతోపాటు గోసూక్తమూ స్మరణకు నోచు కుంటున్నది. అందుకే రుద్రులకు తల్లిగా, వసువులకు పుత్రికగా, ఆదిత్యులకు సోదరిగా, నెయ్యి రూపంతో అమృతంగా చెప్పబడింది- గోవు.**

**గోవు సాక్షాత్తు మహాలక్ష్మీ స్వరూపమే! దేవతలందరూ వచ్చి, లక్ష్మీదేవిలో తమకూ కొంతభాగం కావా లని కోరారట! "నేనే గోవును కాబట్టి మీరంతా గోమాతలోనే ఇమిడి ఉండండి." అని ఆమె సూచన చేసిందట! అప్పుడు సమస్తదేవతలకూ తనలో భాగం ఇచ్చిందట గోవు! కాబట్టే, గోమాతను పూజిస్తే సర్వదేవతలనూ ఆరాధించినట్లే! ఇప్పటికీ మనమంతా నిత్యం చూస్తూనే ఉంటాం- యజ్ఞ యాగాల్ని నిర్వహించే ప్రదేశాల్ని గోమయంతో శుద్ధిచేస్తుంటారు. కొత్తగా ఇల్లు కట్టుకున్నవారు గోవుతో కలిసే గృహప్రవేశం చేస్తుంటారు.**

**మనకు ఆరోగ్యం సూర్యునివల్ల సిద్ధిస్తుంది. వెన్నుపై సూర్యనాడి ఉంటుంది. దానిద్వారా గోవు సూర్యకిరణాల్లోని సారశక్తిని ఆకర్షిస్తుంది. ఆ కారణంగా గోసంబంధమైనవన్నీ పవిత్రమూ, అరోగ్యప్రదమూ అవుతున్నాయి.**





పద్మావతి ఆలయంలోనూ, శ్రీగోవిందరాజస్వామి, శ్రీకోదండరామస్వామి, శ్రీ కపిలేశ్వరస్వామి ఆలయాల్లోని దేవతామూర్తుల క్షీరాభిషేకాలకూ, ప్రసాదాల తయారీలకూ ఉపయోగిస్తున్నారు. అలాగే మూగ, బధిరవిద్యార్థులకు, వికలాంగులకు, అనాథశరణాలయాలకు, కుష్ఠవ్యాధి ఆసుపత్రులకు నిత్యం ఆవుపాలు సరఫరా చేస్తున్నారు. ప్రతిరోజూ ట్రస్టుప్రాంగణంలో నిష్ఠగా గోపూజ జరుగు తుంటుంది. ఆవుల్ని పెంచడమే కాదు. వాటిని భక్తితో పిలుచుకునే, కొలుచుకునే ట్రస్టు సిబ్బందిని చూస్తే పుణ్యప్రదాతలై కన్పిస్తారు. వీరు గోసంతతిని తమ కుటుంబసభ్యులుగానే భావిస్తారు. అవి కూడా వారిసేవలకు ఎంతగానో సంతసిస్తూ మాలిమి చేసే వారందరినీ మోరలెత్తి నిత్యం పలకరిస్తుంటాయి. ఈ దృశ్యం ట్రస్టును దర్శించేవారికి అనుభవైకవేద్యమే! రెండువందల ఏభైమందికి పైగా ఉద్యోగులు గోసంతతిని సంరక్షించేందుకు అహర్నిశలూ ఇక్కడ పాటుపడుతున్నారు. నిత్యగోపూజతో పాటుగా కనుమ నాడు పశువులపండగ, గోకులాష్టమినాడు ఆవులకు పూజ ఘనంగా నిర్వహిస్తుంటారు. తిరుపతిలోనే కాదు. తిరుచానూరులో కూడా ట్రస్టు తనసేవలను విస్తరించడం ముదావహం.

## ఎస్.వి.ట్రస్ట్..... గోసేవలో బెస్ట్.....

స్వల్పమూలధనంతో ఆరంభమైన శ్రీ వేంకటేశ్వర గోసంరక్షణట్రస్టు 'ఇంతింతై వటుడింతై..' అన్నట్టుగా పెరిగింది. ప్రస్తుతం పద్నాలుగురకాల భారతీయగోజాతులు ట్రస్టు ఆధ్వర్యంలో పెరుగుతున్నాయి. మూడువేలకు పైగా గోవులు ట్రస్టు పుణ్యమా అని సంరక్షణకు నోచుకుంటున్నాయి. వీటినుంచి వచ్చే పాలు, పాలపదార్థాలు నిత్యమూ దేవుని కైంకర్యానికి వినియోగిస్తున్నారు. అభిషేకాలకూ, ప్రసాదాలకూ అందిస్తున్నారు. అలాగే నిత్యాన్నదానపథకంలోనూ వినియోగిస్తున్నారు. ఇంకా శ్రీ అలమేలుమంగా

పైనున్న సౌమ్యం, సౌరి, నాగేంద్రభవనం, గంధర్వ, శైలాగ, క్రౌంచ, క్రూర, విచిత్రభవన, బహ్వాపద, దుఃఖద, నానాక్రంద, సుతప్త, రౌద్ర, పయోవర్షణ, శీతాఢ్య, బహుభీతి.... అనే పదహారు పురాలు దాటి, ఊర్ధ్వలోకానికి చేరాల్సి ఉంటుంది. ఆ ప్రయాణంలో తోడుగా వచ్చేది ఒక్క గోమాతే! జన్మనిచ్చిన తల్లి



దండ్రులు, కట్టుకున్నభార్య. కడుపున పుట్టినసంతానం మనతో ఆఖరుసారిగా వచ్చేది స్మశానంవరకే. గోమాత మాత్రం అతి భయంకరవైతరణీనదిని అవలీలగా దాటిస్తుంది. మరణించినవారిశ్రాద్ధకర్మలలో ప్రధానంగా గోదానం చేయాలని చెప్పడానికి హేతువిదే! ఇలా ఏ రకంగా చూచినా గోవులు మనకు దైవాలే. వాటిని పెంచడం, పోషించడం మన కర్తవ్యం.

## కల్యాణగోపాలం.... తి.తి.దే. ధ్యేయం....

"గోరక్షణవల్లనే మనజాతి, మనధర్మం నిలబడుతూంది. గోరక్షణ స్వరాజ్యసముపార్జనకంటే ఏ మాత్రమూ తక్కువ కాదు" అన్న మహాత్మగాంధీజీమాటలు మనసా వాచా కర్మణా నమ్మి, పరమపవిత్రమైన గోమాతసంరక్షణ యజ్ఞానికి మనమంతా శ్రీకారం చుట్టాలి. ఈ క్రతువు ఆవశ్యకతను కలియుగప్రత్యక్షదైవమైన శ్రీవేంకటేశ్వరస్వామి





దేవస్థానం గుర్తించింది. తిరుమలతిరుపతిదేవస్థానం ఆ మహా కార్యాన్ని చక్కగా నిర్వహిస్తోంది. ఆ ఏడుకొండలవాని సన్నిధిలో శ్రీవేంకటేశ్వరగోసంరక్షణబృహత్కార్యం వేయ్యేండ్ల కిందటే ప్రారంభమైందని చెప్పుకోవచ్చు. ఆలయప్రస్థానంతో పాటుగానే గోపాలనకూడా నాడే మొదలైంది. అది దినదినమూ పెరిగి, ఇప్పుడు ఎస్.వి.గోసంరక్షణ ట్రస్టుసేవలతో వటవృక్షమై ఎదిగింది. గోసంతతిని వృద్ధి చేసేందుకు, పరిరక్షించేందుకు అవిశ్రాంతంగా ఈ ట్రస్టు నేడు పాటుపడుతోంది. తిరుపతిలో డెబ్భై ఎకరాలలో విస్తరించి, గోసంరక్షణ నిరంతరాయంగా, నిరాంటకంగా సాగిస్తోంది. మహాగోకులాన్ని నిర్వహిస్తోంది. భక్తులు అందజేసిన గోవులతో పాటుగా శ్రీవేంకటేశ్వరుని సేవలకు అవసరమయ్యే ఏనుగులు, గుర్రాలు, ఇతర పశు



సంతతికూడా ట్రస్టు ఆధ్వర్యంలో పాలనకు నోచుకుంటూ వర్ధిల్లుతున్నాయి. ప్రవర్ధిల్లుతున్నాయి.

### గోశాల.... పుణ్యఫల....

గోవులను సంరక్షించడమంటే వాటిముందు కాసిన్ని గడ్డిపరకలు చల్లేసి అయిందనిపించడం కాదు. ఆ పనే అయితే ఎవరైనా చేయగలరు. ఎస్.వి.గోసంరక్షణ ట్రస్టు చేసేది అది కాదు. గోవుల సర్వసంరక్షణకు పూనుకోవడమే కాకుండా వాటిని కంటికిరెప్పలా కాపాడుతూ ముందుకు సాగడం దానిధ్యేయం, లక్ష్యం. ఒక్కఆవుకు చిన్నపాటి అస్వస్థత కలిగినా ట్రస్టు సిబ్బంది వెనువెంటనే రంగంలోకి దిగిపోతారు. ఆ గోవు ఆరోగ్యాన్ని మెరుగుపరించేందుకు సకలఉపచారాలూ చేస్తారు.



వైద్యం చేయిస్తారు. అంటురోగాలు గనుక ఆవులకు సోకిన పక్షంలో మిగిలిన గోసంతతిని రక్షించేందుకు గాను అనారోగ్య పశుగణాన్ని చిత్తూరుజిల్లా భాకరాపేట సమీపంలో ఉన్న కమలయ్యగారిపల్లెలో ప్రత్యేకంగా ఏర్పాటైన ఆరోగ్యకేంద్రానికి తరలిస్తారు. చికిత్స చేయిస్తారు. స్వస్థత చేకూరుస్తారు. గోసంతతి ఇచ్చే పాలు తీసుకోవడంవరకే కాకుండా, వివిధ రకాల భారతీయగోజాతులసంరక్షణకు గాను ప్రణాళికాబద్ధంగా ట్రస్టు పనిచేస్తోంది. పలురకాల గోవులనుంచి వీర్యసేకరణ చేయడం ద్వారా ఆ జాతిసంరక్షణకు పాటుపడుతోంది. గోసంతతి వృద్ధి, ఆవశ్యకతలపై ప్రజల్లో చైతన్యం నింపేందుకు అవగాహన కార్యక్రమాలను చేపడుతోంది. గోసంతతి వికాసానికిగాను పరిశోధన, అభివృద్ధిపథకాలను చేపడుతోంది. వివిధప్రాంతాల్లో గోరక్షణకేంద్రాల ఏర్పాటుకు పూనుకుంటోంది. "గోసేవ మానవసేవ" నినాదంతో ముందుకు సాగుతోంది. 2016-2017 ఆర్థిక సంవత్సరానికి రూ.11 కోట్లకు పైగా




భోజనం చేసినతర్వాత స్నానం చేయకూడదు

విరాళాలు భక్తులనుంచి ఈ ట్రస్టుకు అందాయి. డిపాజిట్లుగా సంస్థకు 93 కోట్ల రూపాయిలను కూర్చుకుంది. వార్షిక వడ్డీ రూపంలో 8 కోట్ల రూపాయలు లభిస్తున్నాయి. గోవుల సంరక్షణార్థం 9 కోట్లవరకూ ఏటా ఖర్చు చేస్తోంది.

## 'పాలు'పంచుకోవచ్చు.....

గోసంరక్షణ అనే పరమపవిత్రకార్యంలో భక్తులకే పెద్దపీట వేస్తుంది ట్రస్టు. ఆరోగ్యంగా ఉన్న ఆవులను భక్తుల నుండి దానంగా స్వీకరిస్తుంది. అలా దానం చేయడానికి ఆవులు లేని భక్తులనుంచి ట్రస్టువారే కొంత రుసుము వసూలు చేసి, వాటిని సమకూరుస్తారు. వాటిని గోదానంగా స్వీకరిస్తారు. గోసంరక్షణ పవిత్రకార్యంలో భక్తులను భాగస్వామ్యులను చేయ డానికి యథాశక్తి పాటుపడుతూంది-ట్రస్టు నగదు విరాళం ఇచ్చే భక్తులు కనీసం వెయ్యిరూపాయిలకు తక్కువ కాకుండా **'ఎగ్జిక్యుటివ్ ఆఫీసర్, ఎస్.వి.జి.ఎస్.టి., టి.టి.డి.'** పేరిట చెక్కులు, డ్రాఫ్టులు పంపవచ్చు.

అలాగే గోసంరక్షణ ట్రస్టుకు భారీమొత్తంలో విరాళం ఇచ్చే భక్తులకు ఆదాయపన్ను మినహాయింపుకూడా కల్పిం చారు. శ్రీవారిదర్శన, వసతి సౌకర్యాలుకూడా వారికి దక్కు తాయి.

ఈ నేపథ్యంలో కొత్తగా ఒంగోలు జాతిగోవుల అభివృద్ధికి కొత్తపథకం రూపకల్పన చేశారు- ట్రస్టు ప్రతినిధులు. ఇందుకుగాను పశుసంవర్ధక, డెయిరీ మంత్రిత్వశాఖను కొంత మేర ఆర్థికసహాయం అందించ మని ప్రతిపాదనలు పంపారు. గౌరవమంత్రిత్వశాఖాధికారులు కూడా సానుకూలంగా స్పందిం చారని సమాచారం. భక్తులుకూడా గోవులపై ఉన్న మమ



కారాన్ని విరాళాలరూపంలో శ్రీ వేంకటేశ్వరగోసంరక్షణ ట్రస్టుకు ప్రకటించి ధన్యులు కావచ్చు. తిరుమల తిరుపతి దేవస్థానం ఆధ్వర్యంలో శ్రీవేంకటేశ్వర ట్రస్టు నిర్వహిస్తున్న గోసంరక్షణ యాగంలో మనమందరమూ భాగస్వాములై, ఆ దేవదేవునికృపకు పాత్రులం కావచ్చు.

మరెందుకు ఆలస్యం? ఆ వైపుగా భక్తిశ్రద్ధలతో వేంకటేశ్వరస్వామిని తల్చుకుంటూ అడుగులు ముందుకు వేద్దాం.

*ఓం నమో వేంకటేశాయ.*



## భర్తృహరి సుభాషితం

**రహస్యంగా దానం చేయడం, ఇంటికి వచ్చిన వాళ్లను ప్రీతితో ఆదరించడం, తాను చేసిన మేలును చెప్పకోకపోవడం, ఇతరులు తనకు చేసిన మేలును సభలో చెప్పకోవడం, సంపద వచ్చినా గర్వించకుండడం, ఇతరులను నిందించకుండడం - కత్తివాదరపై నడకవంటి ఈ వ్రతం సజ్జనులకు సహజసిద్ధమే కాని ఒకరు బోధించగా అలవడింది కాదు.**





గృహలక్ష్మి

# ఐశ్వర్యప్రదం... వరలక్ష్మీ వ్రతం

ఆగష్టు, 04న శ్రీవరలక్ష్మీవ్రతం సందర్భంగా...

- డా।। మైలవరపు శ్రీనివాసరావు

*'ఎప్పుడు కురుస్తానో నాకే తెలియ'దంటూ ఆకాశంలోని మేఘం భయపెడుతోం దంటే - తడిగాలి చల్లగా వీస్తూ శరీరానికి ఆనందాన్ని కల్గిస్తోందంటే -కదులుతున్న వివిధ జాతుల పుష్పవృక్షాల్లా వింతవింతరంగుల కొత్తచీరలతో ముత్తైదువులు కన్పిస్తున్నారంటే- ఆవులవెంట లేగదూడల్లా అమ్మలవెనకా అమ్మమ్మల వెనకా బాలికలు చేతుల్లో సెనగలమూటతో - మెడకింద గంధపు చారలతో దర్శనమిస్తున్నారంటే మనం శ్రావణమాసంలో ఉన్నామన్నమాటే! అనుకున్న అన్నికోరికలూ వరాలరూపంగా సిద్ధించాలని ప్రార్థిస్తూ, శ్రావణమాసంలో పూర్ణిమకు ముందొచ్చే శుక్రవారంనాడు చేసేపూజ 'వరలక్ష్మీపూజ'. ఈ వరలక్ష్మీపూజలో ఒక్కమారుమాత్రమే కాకండా, జీవితాంతమూ నేను చేస్తూ ఉంటానని మొదటిసారిపూజలో ప్రమాణం చేసినకారణంగా ఈ వరలక్ష్మీపూజే వరలక్ష్మీవ్రతంగా అయింది. అలాంటి ఈ వ్రతంలో ఏం చెయ్యాలో తెలుసుకుందాం!*

ఇది ఓ వ్రతం కాబట్టి శాశ్వతంగా ఉండే విగ్రహానికి కాకండా, బిందెమీద కొబ్బరికాయ పెట్టి, చక్కగా అలంకరించి కూర్చున్న లక్ష్మీదేవిలా ఓవిగ్రహాన్ని సిద్ధం చేసి, ఆమెను ఒకపక్కన ఉంచాలి.

ఇంటికి నట్టనడిమిభాగంలో మంచిపీట వేసి, నూతన వస్త్రాన్ని పరిచి, బియ్యం పోసి, నలుచదరంగా చేసి, దానిమీద పసుపువినాయకుణ్ణి పెట్టి, గణపతిపూజను పంచోపచారాలతో (స్నానం– పూజ – నైవేద్యం – ప్రదక్షిణం– నమస్కారం) ముగించాలి. ఇక్కణ్ణుంచి వరలక్ష్మీవ్రతం ప్రారంభమౌతుంది. పీట నిండుగా పద్మదళాలను గానీ, పంచపల్లవాల్ని (మర్రి – మామిడి – మేడి – రావి – జువ్వి చెట్ల చిగురుటాకులు) గానీ వేయాలి. ఇక్కడ ఆ లక్ష్మీదేవిని కూర్చోబెట్టబోతున్నా మన్నమాట.

## షోడశోపచారపూజల్తో (16 విధాలసేవలు)

### ఆవాహనం

మనం ధ్యానించుకునేందుకు వీలుగా ఏ ఆకారమూ లేని ఆ పరమాత్మస్వరూపానికి మనలాంటిఆకారాన్ని కల్పించి, విగ్రహంలోనికి 'ఆవాహన' చెయ్యడం దీనిభావం. ఆవాహన మంత్రం చదివామంటే మనం సిద్ధం చేసిన ఆ విగ్రహంలోనికి మనం ధ్యానించబోయే ఆ తల్లిరూపం చేరినట్లు భావించాలి.

### ఆసనం

అప్పుడు ఆ తల్లికి ఆసనాన్ని సమర్పించాలి. పద్మదళాలతో లేదా పంచపల్లవాలున్నఆసనం ఆమెకిష్టం. 'ఎప్పుడూ శ్రీమహావిష్ణువక్షఃస్థలమే నివాసంగా ఉన్న "తల్లీ! ఈ ఆసనాన్ని అలకరించు' అనే అర్థముండే మంత్రాన్ని చదివి ఆమెను ఈ పీటమీద భక్తిశ్రద్ధలతో కూర్చోబెడతాం. 'నట్టింటసిరి' ఉండడం అంటే ఇదే!

### పాద్యం

'ఎప్పుడూ కల్పవృక్షపుష్పాలమీదనే నడిచేతల్లీ! నీ సుకుమారపాదాల్ని మా భూలోకజలంతో కదుగుతున్నా' నంటూ పాదాల్ని కడగడం పాద్యం.



## లక్ష్మీదేవి ఎక్కడ నివసిస్తుంది?



గోవులు, తామరపుష్పాలు, పాడిపంటలు, ఏనుగులు, గుర్రాలు, రత్నాలు, అద్దాలు, శంఖనాదం, ఘంటారావం, హరిహరార్చన, పూజామందిరం, సర్వదేవతలనూ అర్చించేవారిస్వరం, తులసి ఉన్న ప్రదేశం, మంగళకరమైన వస్తువులు, పూలు, పండ్లతోటలు, మంగళవాద్యాలు, దీపకాంతులు, కర్పూరహారతి, చెట్లలోని హరితవర్ణం, స్నేహం, ఆరోగ్యం, ధర్మబుద్ధి, న్యాయస్థానాలు, శుచి, శుభ్రత, సదాచారపరాయణత, సౌమ్యగుణం, స్త్రీలు ఎటువంటి చీకూ చింతా లేకుండా హాయిగా ఉండేఇండ్లు, బ్రాహ్మణులు, విద్వాంసులు, పెద్దలు, పండితులకు సన్మానసత్కారాలు జరిగే ప్రదేశాలు, వేదఘోష, సత్త్వగుణసంపదలు, క్రమశిక్షణ, కార్యశూరత్వం, సమయపాలనలోనూ మహాలక్ష్మి నివసిస్తుంది.

### అర్ఘ్యం

దేవతాస్త్రీలనందరినీ ఆశీర్వదించే చేతులతోనూ బ్రహ్మ ఇంద్ర రుద్రులక్కూడా సంపదల్ని అనుగ్రహించేహస్తాలతో ప్రకాశించేతల్లీ! నీ హస్తాలకు పవిత్ర జలాన్ని సమర్పిస్తున్నా నంటూ గౌరవపూర్వకంగా జలాన్నియ్యడం అర్ఘ్యం.

### ఆచమనం

'శుద్ధమైన ఆకాశగంగా జలాన్నిమాత్రమే స్వీకరించే నీకు, నా యథాశక్తి లభించినజలాన్ని ఇస్తున్నా' నంటూ తాగడానికి ఆమెకు అందిచ్చేజలం 'ఆచమనం'.

మన శరీరాలన్నీ నీళ్లు ప్రధానంగా ఉండి జీవించేవి. ఆ తల్లిని మనలాంటి జలమయశరీరంలోనికి ఆవాహనం చేశాం కాబట్టి, శరీరంలో దిగువభాగమైన పాదాలకూ, మధ్యభాగమైన హస్తాలకూ–ఊర్ధ్వభాగమైన ముఖానికీ జలాన్ని అందిస్తూ– ఆ లక్ష్మీదేవినికూడా మనలో ఉన్న ఒక స్త్రీగా భావిస్తూ పూజిస్తున్నాం.

### అభిషేకం లేదా స్నానం

ఇటు వైపూ - అటు వైపూ చెరొక ఏనుగూ - వాటితొండాల్లో మానస సరోవరజలం నిండిన బంగారుకుండలూ - వాటితో నిత్యాభిషేకాన్ని చేయించుకునే తల్లీ! నాకు లభించినంతలో ఉత్తమజలంతో అభిషేకిస్తున్నా'నంటూ స్నానాన్ని చేయించాలి– తల్లికి.

### వస్త్రం

మరింతతెల్లగా ఉండేవస్త్రాన్ని సమర్పిస్తూ 'ఏ విధమైన హింసనూ చేయకుండా, లభించే అహింసా పట్టువస్త్రాల్ని ధరించే తల్లీ! దీన్ని స్వీకరించు' అని ప్రార్థించాలి. (మామూలు పట్టువస్త్రాలన్నీ పట్టుపురుగుల్ని వేడినీళ్లలో వేసి, చంపగా వచ్చేవే అందుకే వీటిపేరు హింసాపట్టువస్త్రాలు.)

### ఉపవీతం

పురుషదేవతలకైతే యజ్ఞోపవీతాన్నిస్తారు. స్త్రీదేవతలకైతే ఉత్తరీయాన్నిస్తారు. ఉత్తరీయమంటే భుజంమీద కప్పుకునే మరో వస్త్రమని అర్థం. ఇది అసహజం కాదు–కాబోదు. శ్రీమద్రామాయణంలో సీతమ్మ తన భుజమ్మీది ఉత్తరీయంలోనే నగల్ని మూటగట్టి కింద పడవేసింది. ప్రాచీనదేవతావిగ్రహాల్ని పరిశీలిస్తే భుజంమీద ఉత్తరీయాన్ని చెక్కినట్లు కన్పిస్తాయి.

ఇలా ఉత్తరీయాన్ని ఇయ్యడమనే ఆచారాన్ని వెనక్కిపెట్టినందువల్లే, స్త్రీలు యజ్ఞోపవీతాల్ని ధరించడం - సంధ్యాకాలంలో తనకు నిత్యనియమంగా ఉన్న జపాన్ని సీతమ్మ చేస్తే ఆమె సంధ్యావందనాన్ని చేసేది కాబట్టి (సంధ్యాకాలమనాః....) మేమూ ఓ యజ్ఞోపవీతాన్ని ధరించి, సంధ్యావందనం చేస్తామని వాదులాడడం వంటివి జరుగుతున్నాయి.





వ్యక్తిఅల్పత్వాన్నికానీ, ఔన్నత్యాన్నికానీ పలుకే సూచిస్తుంది.

### గంధ - పుష్ప-అక్షతలు!

ఆ తల్లికి గంధాన్ని పూయడం లేదా చల్లడం. పూసి నప్పుడున్న దానికంటె ఆరినకొద్దీ సువాసననిస్తుంది గంధం. గంధంలా కాక, అలంకరించినప్పటికంటె కాల క్రమంలో వాడుతూపోతాయి పుష్పాలు. ఇలా గంధంలా పెరగడం, అలా పుష్పాల్లా తరగడం కాక శాశ్వతంగా ఉండేవి "అక్షతలు" అమ్మవారిపాదాలమీద సమర్పించాలి.

**తర్వాత 'అష్టోత్తర శతనామ - అంగ - తోరగ్రంథి' పూజలు.** ఆ తల్లి గొప్పతనాన్ని వర్ణిస్తూ ఆమె మనకు కలిగించే నూట ఎనిమిది ప్రయోజనాల్ని వివరించే పూజ– అష్ట+ఉత్తర+ శతనామ (108) పూజ.

'ఇంత గొప్పతనం ఉన్న ఆ తల్లి దేవలోకానికి సంబంధించిందిమాత్రమే' అనుకోకండా 'అంగపూజ' చేస్తాం. పాదాల నుంచి తలవరకూ ఉండే భాగాలనన్నిటినీ స్మరిస్తూ చేసేపూజ – ఇది. ఈ పూజ చేసినకారణంగా మనం అనుకోవాలి – ఈ పూజనందుకునేలక్ష్మీదేవి మాలాగే ఓ స్త్రీయే – అయితే మనకంటె పూజ్యురాలు' అని. దీనివల్ల ఆమెతో మనకు దగ్గరతనం ఏర్పడుతుంది.

పిదప 'తోరగ్రంథిపూజ'. ఏ లక్ష్మీదేవిని మనమిక్కడ ఆరాధించామో ఆ తల్లిని మనలా స్థూలశరీరం కలదాన్నిగా భావిస్తూ, ఆ శరీరం ఆకారంలోనే నిలువుగా తొమ్మిది దారాలను ఒకటిగా కలిపి, వాటికి తొమ్మిదిచోట్ల ముడివేస్తూ, ప్రతిముడిలోనూ ఓ పువ్వును ఉంచి, ఆ తోరానికి పూజ చేసి, చేతికి కట్టుకుంటాం. అంటే, ఈ లక్ష్మికి ఈ వరలక్ష్మీవ్రతం అయ్యాక వీడ్కోలు చెప్పం. అంతటితో ఈ వరలక్ష్మీవ్రతం ముగియలేదనీ, ప్రతి సంవత్సరం నేను చేస్తూనే ఉంటాననీ చెప్పడమన్న మాట.

ఆ లక్ష్మీరూపం ఈ తోరం (నా స్థూలదేహం)తో కూడిన గ్రంథుల్లో (శరీ రానికున్న ముడులలో) ఉందనీ, ఆ కారణంగా లక్ష్మీదేవి నా కుడిచేతిమణికట్టుకు నిత్యం ఉందంటే ఆమె సన్నిహితంగా నాకుందన్న మాటేనని భావించడం దీని తాత్పర్యం. (శరీరానిక్కూడా నవ (9) గ్రంథులే ఉంటాయని ఆయుర్వేదశాస్త్రం.)

### వ్రతకథ

మగధదేశంలో 'కుండిన' అనే పేరున్ననగరంలో చారుమతి అనే ఆమెకు కలలో లక్ష్మీదేవి కన్పించడం – శ్రావణంలో పూర్ణిమకు ముందువచ్చే శుక్రవారంనాడు వరలక్ష్మీపూజ చేసుకోవలసిందని ఆమెకు చెప్పడం – తానొక్కతె మాత్రమే ఆ ఆనందాన్ని అనుభవించడంకంటే పదిమందితో పాలు పంచుకోవాలని భక్తిశ్రద్ధలతో తోటిముత్తైదువులతో ఆమెపూజ చేయడం– పూజానంతరం ఒక్కో ప్రదక్షిణానికీ ఒక్కొక్కటి చొప్పున మూడు ప్రదక్షిణాల్లోనూ క్రమంగా బంగారు గజ్జలూ– హస్తకంకణాలూ– సర్వాభరణాలూ వాళ్లందరికీ లభించడం – ప్రతిసంవత్సరం ఈ పూజ చేస్తూ, దీన్ని

### సంపదలంటే ఏమిటి?




**సాధారణంగా..
మనం ధనం అంటే....
డబ్బు ఒక్కటే అనుకుంటాం.
అయితే -
ఆయుస్సు, ఆరోగ్యం, ఐశ్వర్యం,
ధైర్యం, స్థైర్యం, విజయం,
వీర్యం, అభయం, శౌర్యం,
సౌభాగ్యం, సాహసం, విద్య,
వివేకం, ధనం, ధాన్యం, సంపద,
బంగారం, వెండిఆభరణాలు,
వస్తువులు, వాహనాలు,
ఆయుధాలు, పశువులు,
పుత్రపౌత్రాదులు, కీర్తిప్రతిష్ఠలు,
సుఖసంతోషాలు-
మొదలైనవన్నీ సంపదలే!
వీటన్నింటికీ....
అధినేత్రి ఆ శ్రీమహాలక్ష్మే.
ఆమెఅనుగ్రహంతోనే సాధ్యం.
కాబట్టి ఆమెను పూజించి,
ఈ సంపదలు పొందుదాం!**



ఓ 'వ్రతం'గా మార్చుకోవాలనివాళ్లంతా అనుకోవడ మనే ఇదంతా వ్రతకథ.

ఒక్కరే కాకండా పదిమందీ కలిసి పూజ చేసు కోవడంలో ఓ ఆనందం, అంతా ఒక్కచోట కలిసి భుజిం చడంలో ఓ సంతోషం, అలంకరించుకున్న అందర్నీ అందరూ చూసుకోవడం పలకరించుకోవడంలో ఓ ధైర్యవిధానం, మాన సికప్రశాంతత అన్నీ లభిస్తాయి.

షోడశ (16) ఉపచారాల్లో వ్రతకథ భాగం కాదు. కాబట్టి కథ అయ్యాక దేవతకిచ్చే **ధూపం - దీపం - నైవేద్యం- తాంబూలం అనేవి క్రమంగా పదకొండునుంచి పద్నాలుగు వరకూ ఉండే ఉపచారాలు అవుతాయి. నీరాజనమంత్రపుష్పాలు రెండూ కలిపి పదిహేనవఉపచారం.**

తాను ఆరిపోతూ వెలుగు ప్రసాదించేదీ, అమ్మకున్న ముఖసౌందర్యాన్ని ఇనుమడింపచేస్తూండేదీ, తనలోని పర మాత్మను దర్శించాలని చెప్పేదీ, తిరిగి పైసంవత్సరం తప్పక పూజ చేసుకోవాలనే బుద్ధిని కల్గించేదీ, క్రిముల్ని హరించి సువాసన నింపేదీ నీరాజనం, కర్పూరంలాగే, వ్యక్తి ఆయుస్సు తరుగుతున్నా తనప్రకాశంలాగానే వ్యక్తికున్న ప్రతిభ కాంతి మంతంగా వెలుగుతూ ఉండాలనేది దీనిభావం.

ఇప్పటివరకూ పూజచేసిన ఏ పరమాత్మస్వరూపం ఓ దేవిగా మనముందుందో ఆ రూపం మనశరీరంలోనే ఉందంటూ వివరించి చెప్పేది మంత్రపుష్పం.

ఇంతటి దేవి మనలోనే ఉన్నప్పుడు మనం ఆమెకు భక్తిశ్రద్ధలతో ప్రదక్షిణం చేయాలనుకుంటూ చేసేదే ఆత్మప్రదక్షిణంతో కూడిన నమస్కారం (తన చుట్టూ తానూ తిరుగుతూ నమస్కరిస్తూ ఉండడం). ఇది పదహారవఉపచారం. వ్రతం చేసుకునే వీలూ, శ్రద్ధా లేకపోయినా కనీసం సంప్రదాయానికి అర్థాన్నైనా తెలుసుకుంటే ఇష్టపడుతుంది అమ్మ.

చివరికి వాయనాన్నిస్తూ "ఓ తోటిముత్తైదువా! ఈ వ్రతమంతా అయ్యాక నువ్వూ లక్ష్మివే. నేనూ లక్ష్మినే. మనందరిలోనూ లక్ష్మి ఉందని గ్రహించాను. మనచేతితోరాల్లో లక్ష్మి ఉండి, మనకు శుభాల్ని కల్గి స్తుందనీ అర్థం చేసుకున్నాను. కాబట్టి దీన్ని లక్ష్మీస్వరూపిణివై స్వీకరించు! అనే అర్థం ఉన్న ఈ శ్లోకాన్ని చదువుతూ వాయనమియ్యాలి.

**ఇందిరా ప్రతిగృహ్ణాతి ఇందిరా వై దదాతి చ ।**
**ఇందిరా తారికా ద్వాభ్యామ్ ఇందిరాయై నమో నమః ॥**

'అఖండలక్ష్మీప్రాప్తి రస్తు - సమస్తసన్మంగళాని భవంతు.' 

## వైకుంఠపాళి
## :: 21 - సమాధానాలు ::

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 అ | | 2 అం | చ | 3 గు | ట్ట | 4 పు | జో | 5 దు |
| చ | | దె | | ణ | | ణ్యం | | హి |
| 6 లా | క్ష | | 7 కు | గ్రా | మం | | 8 కై | త |
| త్మ | | 9 సు | | హి | | 10 అం | | |
| 11 జ | న | క | జ | | 12 వై | జ | యం | 13 తి |
| | | న్య | | 14 తి | | లి | | రు |
| 15 అ | రి | | 16 కు | మ్మ | రి | | 17 క్ర | మం |
| నా | | 18 కై | | రు | | 19 రే | | జ |
| 20 ది | న | క | ర | సు | తు | డు | | నం |




శ్రీ బలరామావతారం, శ్రీకృష్ణావతారం రెండూ ఒక వరుస క్రమంలో వచ్చిన అవతారాలు. దేవకీవసుదేవులకడుపున కృష్ణభగవానుడు జన్మిస్తే వసుదేవరోహిణుల కడుపున జన్మించినవాడు - బలరాముడు. "దేవకిఅష్టమ గర్భునిచేత నీవు సంహరింపబడతా"వని కంసునికి అశరీరవాణి వినిపించినప్పటినుండి ఆయన దేవకీవసుదేవుల కడుపున పుట్టిన ప్రతిశిశువునూ సంహరిస్తూవచ్చాడు. యథార్థానికి మొదట చంపకపోయినప్పటికీ, నారదుడు వచ్చి చెప్పినప్పుడు తరువాత శిశువులందరినీ సంహరించాడు. ఏడవగర్భం వచ్చేటప్పటికి పరమాత్మ ఒక విచిత్రమైనస్థితిని ఆవిష్కరించాడు. నందుడు, వసుదేవుడు మంచిస్నేహితులు. వసుదేవుడు కారాగారంలో ఉండగా, వసుదేవునిభార్య రోహిణి నందునివద్ద ఉంది. యోగమాయను పిలిచి దేవకీదేవిగర్భంలోని పిండాన్ని సంకర్షణం చేయించి అనగా దేవకీదేవి గర్భంలోని పిండాన్ని పూర్తికాలం గర్భంలో ఉండి బిడ్డగా ఎదిగే అవసరం లేకుండా అకారంగా, గర్భస్రావమై ఆ పిండాన్ని తీసుకుని వెళ్లినందుని గృహంలో ఉన్న వసుదేవునిభార్య రోహిణిగర్భంలో యోగమాయ ప్రవేశపెట్టింది. గర్భసంకర్షణంచేత పుట్టినవాడు కనుక సంకర్షణనామం వచ్చింది.

విశేషమైన బలం కలవాడగుటచేత బలభద్రుడు అని ఒక పేరు. అందరినీ ఆనందింపచేసి, రమింపచేస్తాడు కాబట్టి రాముడు అని ఒక పేరు. తెల్లనివర్ణంతో ఉంటాడు-సాక్షాత్తు శేషుని అంశ. రోకలి, నాగలి ఆయనఆయుధాలు.

ఇన్నిపేర్లతో పిలవబడ్డ బలరాముడు శేషాంశ గనుక శ్రీమన్నారాయణునికి మార్చిమార్చి సేవ చేస్తుంటాడు. ఆయనే స్వామి కూర్చునే ఆసనం, పడుకోవడానికి శయనం అవుతాడు. ఛత్రమవుతాడు. అనేకవిధాలుగా పరిచర్య చేయడంలో సిద్ధహస్తుడు.

బలరాముడు రెండుప్రధానమైన రాక్షస సంహారాలు చేశాడు. ఒక రాక్షసునికి ప్రలంబాసురుడు అని పేరు. ఆయన కంసునిపనుపున వచ్చిన రాక్షసుడు. ఎంతమందివచ్చినా కృష్ణుణ్ణి నిర్జించలేకపోయారనీ, కృష్ణుని అన్న బలరాముణ్ణి నిర్జిస్తే కృష్ణుడు ఉండలేడనీ, బలహీనుడౌతాడు




గొడవ వదలిపోతుందని వచ్చి, గోకులంలో కలసిపోయి, పిల్లవాడుగా మారిపోయాడు. కృష్ణపరమాత్మ ఇది కనిపెట్టాడు. బలరామునివద్దకు వెళ్ళి "అన్నయ్యా! వీడు మనతో ఉన్న స్నేహితుడు కాడు. రాక్షసుడు మారువేషంలో వచ్చి, మనతో ఆటలకు చేరాడు" అన్నాడు.

ఒక విచిత్రమైన ఆటని చెప్పాడు. పిల్లలందరూ రెండు పక్షాలుగా విడిపోయి ఆడుతుంటారు. గెలిచినపక్షంవాళ్లను ఓడిపోయినపక్షంవాళ్లు మోసి, తీసుకుని వెళుతుండాలి. ఒక మర్రిచెట్టును హద్దుగా పెట్టుకుని మొయ్యాలి. కృష్ణుణ్ణి ఎలాగూ నిర్జించలేరు కనుక బలరామునిపక్షంలో చేరి ఓడిపోయినప్పుడు బలరాముణ్ణి తాను ఎత్తుకునిపోయి, దూరంగా వెళ్ళి, చంపేయచ్చు అని అతనిపక్షం చేరినట్లుగా నటించాడు.

లోకంలో కొంతమంది భగవత్పక్షంలో ఉన్నట్లుగా ఉండి, స్వార్థం చూసుకుంటూ ఉంటారు. కృష్ణుడిపక్షంలో చేరినప్పుడు బలరాముడిబృందం గెలిచింది. ఓడిపోయిన బృందం కాబట్టి గెలిచినబృందాన్ని మోయాలి. బలరాముణ్ణి తాను మోస్తానని ఎక్కించుకుని దూరంగా తీసుకుని వెళ్ళిపోతుండగా, సహజస్వరూపం పొందాడు. వడివడిగా తీసుకుని వెళుతుంటే బలరాముడు గమనించి, ఆ రాక్షసుణ్ణి నాలుగు పిడిగుద్దులు గుద్దేటప్పటికి ప్రలంబాసురుడు అక్కడి కక్కడే మరణించాడు. అది ఒకవధ.

దానికన్నా ప్రధానమైంది గార్దభాసురసంహారం-గాడిద రూపంలో ఉండే రాక్షసుడు. తాటిపండుకు చాలా సువాసన. బాగామగ్గిన తాటిపండు కింద పడిపోతే పైన నల్లగా అయిపోతుంది. అది కొంచెం పెట్లితే లోపలనుండి కొంచెం బంగారురంగు కనపడుతుంటుంది. కాలిస్తే ఇంకా సువాసన. అందమైన రంగుతో రుచిగా ఆకర్షణీయంగా ఉంటుంది. గాడిదరూపంలో ఉండే రాక్షసుడు పై నుంచి

కిందపడిన తాటిపళ్లను-అది గాడిద కనుక ఎవరినీ ముట్టుకోని వ్వదు, తాను తినదు. ఈ గోకులంలోని పిల్లలు అది తినాలనే ఆశకొద్దీ లోపలకు వెడితే, వెనకకాళ్లతో తన్ని చంపుతుంటాడు. అందరూ వెళ్ళి కృష్ణుడికి చెప్పారు. కష్టమైనా, సుఖమైనా వాళ్లు ఆయనకే చెప్పుకుంటారు. ఆయన "తప్పకుండా మీకు తినే ఏర్పాటు చేస్తా"నని బలరాముణ్ణి విశేషమైన స్తోత్రం చేసి, "అన్నయ్యా! ఈ పని నీవల్లనే జరగాలి?" అన్నాడు.

బలరాముడు ఆ తాటిచెట్లను పట్టుకుని బలవంతుడు కనుక ఊపితే, తాటిపళ్లు కింద పడ్డాయి. ఆ చప్పుడు వినగానే గాడిద పరిగెత్తుకుని వచ్చి, బలరాముణ్ణి తనవెనకకాళ్లతో తన్నింది. వెంటనే బలరాముడు ఆ గాడిదకాళ్లు పట్టుకుని గిర గిరా త్రిపి, కింద కొట్టి చంపేసాడు. దీన్ని గార్దభాసురసంహారం అంటారు. గాడిద చనిపోగానే దానిమిగిలినసైన్యమంతా వచ్చింది. ఒక పంచె ఉంటే అందులో దారాలు ఉంటాయి. దారాలే పంచెగా మారినట్లు పరమేశ్వరుడే ప్రపంచంగా



మారాడు. అయినప్పుడు గార్దభసైన్యాన్ని సంహరించడం ఒక లెక్కా? అందుకని చంపేశాడు. గార్దభాసురవధ పూర్తైపోయింది. దాన్ని బలరాముడు చేసినఉత్కృష్టమైనలీలల్లో ఒకటిగా పరిగణిస్తారు.

బలరాముడు దుర్యోధనపక్షపాతి. ఎంత పక్షపాతి అనేది విరాటపర్వం ప్రారంభంలో ఉంది. విరాటునికుమార్తె ఉత్తరను అభిమన్యునికి ఇచ్చి పెళ్లి చేస్తారు. పెళ్లైపోయాక, సభలో శ్రీకృష్ణపరమాత్మ పాండవుల అరణ్యవాసం, అజ్ఞాతవాసం జయప్రదంగా పూర్తయ్యాయి కనుక, వీరికిరావాల్సిన రాజ్యభాగం రావల్సి ఉందని ప్రస్తావన తెచ్చాడు. అప్పుడు బలరాముడు మాట్లాడినమాటలు వింటే ఆయన ఎంత దుర్యోధనపక్షపాతీ అనేది అర్థమౌతుంది. "శకుని న్యాయసమ్మతంగానే జూదంలో ఓడించి రాజ్యాన్ని పొందాడు. రాజ్యం దుర్యోధనునిది. వీళ్లకు అధికారం లేదు. రాజ్యం వీళ్లు బతిమాలి తెచ్చుకోవాలి. కార్యసాధకుడైన బ్రాహ్మణుని పంపించ'మని అంటాడు.

వెంటనే సాత్యకి విభేదిస్తాడు. "వాళ్లు న్యాయంగా జూదంలో ఓడించలేదు. అది పాండవులకు అధికారం ఉన్నదే" అంటాడు. కృష్ణుడు పాండవపక్షపాతి అని ముద్రవేసి, సభను విడచిపెట్టి వెళ్ళిపోతాడు. వెళ్లిపోయిన బలరాముడు కురుక్షేత్ర సంగ్రామం ప్రారంభంలో కృష్ణభగవానునికి నచ్చచెప్పే ప్రయత్నం చేస్తాడు. కృష్ణుడు పాండవులపక్షాన నిలబడ్డానికీ, అర్జునునికి సారథ్యం చెయ్యడానికీ అంగీకరిస్తాడు. ఆ కారణంగా కృష్ణుడు ఇవతలిపక్షంలో ఉండగా, తాను దుర్యోధనునిపక్షంలో ఉండ లేక తీర్థయాత్రలకు వెళ్లిపోతాడు.

మహాభారతంలో బలరామునితీర్థయాత్రలు చాలా విశేషంగా వర్ణన చేస్తారు. కురుక్షేత్రసంగ్రామమయ్యేటప్పటికి బలరాముడు తిరిగివస్తాడు. ఆయన భీముడు, దుర్యోధనుడు గదాయుద్ధానికి సిద్ధపడుతున్న సమయానికి తిరిగివచ్చాడు. "సమయానికి తిరిగివచ్చావు. రేపు భీమదుర్యోధనులు గదా యుద్ధం చేస్తున్నారు. వచ్చి కూర్చో"మని అంటే వెళ్లికూర్చున్నాడు. ఇద్దరిమధ్య ఘోరమైన యుద్ధం జరుగుతుండగా, భీమసేనుడు తన గదాయుద్ధంలో దుర్యోధనునితొడలు విరగకొట్టగానే, ఆయన పడిపోయాడు.





"గదాయుద్ధంలో నాభికిందభాగంలో కొట్టకూడదని నియమం. నా శిష్యుణ్ణి ఇంతమందిసమక్షంలో నాభికింద భాగంలో కొట్టి, పడగొట్టావు కనుక నిన్ను చంపేస్తా"నని నాగలీ, రోకలీ పట్టుకుని భీమునిమీదకు వెళ్లాడు.

అలా వెళుతున్నప్పుడు కృష్ణుడు బలరాముణ్ణిశాంతింప చేస్తాడు."అన్నయ్యా! ఇది మోసంతో చేసింది కాదు. అందరి ముందూ సభలో భీముడు ద్వంద్వ యుద్ధంలో నీ తొడలు విరగకొట్టి చంపుతానని ప్రతిజ్ఞ చేసాడు. ఒక సుక్షత్రియుడుగా తనమాట నిలపెట్టుకోవడానికి చంపాడు. దుర్యోధనునికి తొడలు విరిగిపడిపోవాలని మైత్రేయ మహర్షి శాపం ఉంది. ఇన్నీ సమకూరడంవల్ల దుర్యోధనుడు పడిపోయాడు. దోషమంతటినీ తీసుకుని వెళ్లి, భీమునిమీద ఆరోపించి మాట్లాడకూడదు" అంటాడు. శాంతించిన బలరాముడు కృష్ణునితో విభేదించలేక అలిగి వెళ్లిపోతాడు.

**బలరాముడు చాలా గంభీరమైన స్వభావంతో ఎప్పుడూ కృష్ణునికి రక్షకత్వమనే కోరిక ఉన్నవాడు. ఆ కారణంచేత ఆయనతో కలిసే ఉంటాడు. అటువంటి బలరాముడు మహాభారతంలో దుర్యోధనునికి గురువై, భీముడికీ, దుర్యోధనునికీ గదాయుద్ధం నేర్పిన వాడు బలరాముడే. భీమసేనుడు అరణ్య వాసానికి వెళ్లిపోవాల్సివచ్చింది. అరణ్యవాసానికి వెళ్లినవాడు తిరిగివచ్చాక యుద్ధం ప్రధానంగా వారిద్దరిమధ్యే జరుగుతుంది. ఎందు వల్లనంటే భీమసేనుడికి దుర్యోధనుని తొడలు విరగకొట్టేస్తాననే ప్రతిజ్ఞ ఉంది. ఆఖరికి ద్వంద్వయుద్ధం తనకూ, భీమునికే జరుగుతుందని, కనుక అతణ్ణి జయించడానికి తగిన బలం పొందాలనే ఆయన అరణ్యవాసం చేసినంత కాలం బలరామునివద్ద గదాయుద్ధంలో ఉండే మెళకువలు అన్నీ దుర్యోధనుడు నేర్చుకున్నాడు.**

చివరికి గాంధారిశాపానికి కృష్ణభగవానుడు శరీరం విడిచిపెట్టేసమయంలోనే బలరాముడు ఒక చెట్టుకింద కూర్చుని ధ్యానం చేస్తుండగా, ఆయన నోట్లోనుండి ఒక తెల్లనిసర్పం బయటివచ్చి సముద్రంలోకి వెళ్లిపోతుంది. ఆ పాము సముద్రంలోకి వెళ్ళిపోగానే బలరామునిశరీరం పడిపోతుంది. బలరాముడు సాక్షాత్తుగా సహస్రఫణుడైన ఆదిశేషుడు. అది నిరూపించడానికే ఆయన నోట్లోనుండి ఒక సర్పం బయటికి రాగానే ఆయనశరీరం పడిపోతుంది.

బలరాముడు దశావతారాల్లో ఒక అవతారంగా కృష్ణపరమాత్మతో కలసి ఉన్నవాడు. వసుదేవునికొడుకు అయిన కారణంచేత తమ్ముడితో ఉంటూ రక్షించుకుంటూ కనపడతాడు. సూక్ష్మంగా చూస్తే చాలాచోట్ల కనపడతాడు. మనం వినాయక చవితికి చదువుకుంటున్న కథ ఎలా ప్రచారంలోకి వచ్చిందో కానీ, అందులో చెప్పింది శమంతకోపాఖ్యానం కాదు. విష్ణుపురాణం మొదలైనవాటిలో ఉండే కథ వేరు. అసలు శమంతకోపాఖ్యానంలో బలరాముడు కనపడతాడు. బలరామకృష్ణులది అవినాభావసంబంధం. కృష్ణపరమాత్మను సేవించి ఆయనతో ఉండే అవతారం బలరామఅవతారం. బలరాముడు పక్కనలేకుండా కృష్ణుడు ఎక్కడా కనపడడు. ఒకవేళ కనపడ్డాడు అంటే ఏదో ఒకవిశేషమైనలీల జరుగుతున్నదని గుర్తు.

కాళియమర్దనం జరుగుతున్నప్పుడు బలరాముడు పక్కన ఉండడు. కాళియుని పడగలలో చుట్టబడిన కృష్ణుడు చనిపోతాడని మిగిలినవాళ్లు భయపడతారని, వాళ్లకు ధైర్యంచెప్పడానికి బలరాముణ్ణి విడిచిపెట్టి వెళ్ళాడు. వారందరూ యమునానదిలో దూకి ప్రాణాలు విడచి పెడతామని అన్నప్పుడు, గోపబాలురనూ, గోపకాంతలనూ రక్షించినవాడు–బలరాముడు. "మీరు బెంగపెట్టుకోవద్దు. కృష్ణుడు కాళియునిపడగలలోనుండి విడివడి కాళియమర్దనం చేసి, పైకి వస్తాడు" అని చెప్పి ఆపుతాడు.

బ్రహ్మ దూడలను దాచేసినసందర్భంలో కృష్ణుడు అన్నిటినీ సృజిస్తే ఆవులు, దూడలమధ్య అపారమైన ప్రేమను గమనించి, ఇవి బ్రహ్మసృష్టిలోనివి కావనీ, తనతమ్ముడు సృష్టించాడని కనిపెట్టింది – బలరాముడే! వాళ్లిద్దరిమధ్య ఎంతో అన్యోన్యమైన సంబంధం ఉంటుంది అనేది గమనించడానికి బలరామావతారం శ్రీకృష్ణావతారానికి పక్కనే ఉంటుంది. ఏడవ గర్భం బలరాముడు, ఎనిమిదవగర్భం శ్రీకృష్ణపరమాత్మ. యోగంలో అలాగే చెపుతారు. యోగమార్గంలో అష్టాంగస్థాయిని సమాధిస్థాయి అంటారు. ఆ ఎనిమిదవమెట్టు అయిన సమాధి స్థాయి కృష్ణపరమాత్మ అయితే, ఏడవమెట్టు బలరాముడు. అంత దగ్గరగా ఉంటారు. దశావతారాలలో బలరామావతారం చాలా విశేషంగా స్తుతించబడ్డ అవతారం.





# అశుచిదోషాలు పోగొట్టే వ్రతం

- శ్రీమతి డి.వరలక్ష్మి

భాద్రపదశుద్ధపంచమిని ఋషిపంచమి పర్వదినంగా జరుపుకుంటారు. రుషిరుణం తీర్చుకునే పర్వదిన మిది. ఈ రోజున సప్తరుషులను షోడశోపచారాలతో పూజించి, నైవేద్యాన్ని సమర్పించాలి.

### ఎందుకు చేయాలి?

శరీరంలో నవరంధ్రాలుంటాయి. ఈ నవరంధ్రాలూ విడుదల చేసే మలినాన్ని శుభ్రం చేసుకుంటూ ఉంటాం. అయితే రుతుకాలానికిమాత్రం మూడురోజులు పడుతుంది. ఈ కాలంలో స్త్రీలకు కడుపునొప్పి తలనొప్పి, ఒళ్లనొప్పులు ఉంటాయి. అశుచి రావడానికి కొద్దిరోజులు ముందు నుంచే ఈ బాధలు మొదలౌతాయి. ఈ రోజుల్లో ఆమెకు ఇంటిపని కేటాయించ కుండా ఉంటే విశ్రాంతి లభిస్తుంది. శాస్త్రం ప్రకారం ఈ అశుచికాలంలో స్త్రీలు ఇంటిపనీ, వంటపనీ చేయరాదు. వారిని ఎవరూ తాకరాదు. దీన్ని మూర్ఖత్వంగానో అనుకోగూడదు. అయితే దురదృష్టవశాత్తూ భార్యాభర్తలిద్దరూ పనిచేస్తే కానీ గడవని పరిస్థితుల్లో స్త్రీలను బహిష్టుసమయంలో దూరంగా ఉంచి, వారికి విశ్రాంతి ఇచ్చే అవకాశం లేకుండాపోతోంది.

అయితే సదాచారవంతులై ఉండి, అవకాశంలేక, విధిలేక ఇలాంటి అశుచిని కలుపుకోక తప్పనిపరిస్థితులతో ఉండేవారు ఋషిపంచమీవ్రతాచరణద్వారా తెలిసీ తెలీక చేసే అశుచిదోషాలు తొలగిపోతా యంటోంది ధర్మశాస్త్రం. ప్రతివ్రతానికీ ఉన్నట్లే దీనికీ పూజా, వ్రతకథా, నైవేద్యమూ ఉన్నాయి.

### ఎప్పుడు? ఎలా?

వినాయకచవితి మరునాడు గంగానదీజలం, బురద, తులసిచెట్ల మట్టి, ఆవుపేడ, రావిచెట్ల మట్టి, గంధపుచెక్క, నువ్వులు, గోమూత్ర మిశ్రమాలతో 108 మార్లు శరీరాన్ని శుభ్రం చేసుకోవాలి. అంటే తల మీద 108 ఆకులు పేర్చి, ఒక చెంబుతో 108 మార్లు నీళ్లు పోసుకుని శిరఃస్నానం చేయాలి. ఈ స్నానం గంగలోకానీ, ఏదైనా నదిలోకానీ, కాలువ ఒడ్డున, ఏటిఒడ్డున లేదా గృహంలోగానీ చేయవచ్చు. స్నానానంతరం గణపతి, నవగ్రహాలు, షోడశమాతల పూజ చేయాలి. సప్తర్షులు, అరుంధతిచిత్రాలను చిత్రించి, వాటికి పంచామృతం, నీరు, కుంకుమ, గంధంచెక్క, బియ్యం, పూలు, ప్రసాదం, పళ్లు, ఆకువక్కలు, యాలకులు, లవంగాలు, కొంత డబ్బు సమర్పిస్తారు. ఈ పండుగకు సంబంధించిన కథాశ్రవణం చేయాలి. అనంతరం హారతి ఇవ్వాలి.

> విధివిధానం మేరకు ఋషిపంచమీవ్రతాన్ని ఆచరించడానికి వీలుకానివారు కనీసం ఈ రోజున తులసిచెట్టుమట్టి, రావిచెట్ల మట్టి, గంగాజలం, ఆవుపేడ, గంధం, గోమూత్రం మిశ్రమంతో శరీరాన్ని శుద్ధిచేసుకోవాలి.
>
> అరటిపళ్లు, నెయ్యి, చక్కెర, దక్షిణ, ఓ బ్రాహ్మణుడికి సమర్పించాలి. ధాన్యం, పాలు, పెరుగు, ఉప్పు, పంచదారలు లేని పదార్థాలతో తయారుచేసిన ఒంటిపూట భోజనం చేయాలి.
>
> తాజాపళ్లుకానీ, ఎండుపళ్లు కానీ సేవించవచ్చు.

### వ్రతకథ

పూర్వం ఉద్దాలక మహర్షిభార్య ప్రతి రోజూ పగలూ రాత్రీ క్రిమికీటకాలు శరీరం నిండుగా ఉండి తీవ్రదుఃఖాన్ని అనుభవిస్తోంది. తనభార్యకు వచ్చిన కష్టానికి కారణమేమిటో తెలుసుకోవా లని ఆయన ధ్యానం చేయగా, పూర్వజన్మలో ఆమె బహిష్టుసమయంలో అంటు పాటించకుండా ఇంటిలో ఉన్న భాండాల్ని తాకింది. అంతే కాకుండా ఏవిధమైన అంటుదోషాన్నీ పాటించకుండా ఇంటిలో కలిపేసింది కాబట్టి ఆమె ఇలా క్రిమికీటకాల బారిన పడుతోందనీ, దీనికి నివారణగా ఋషిపంచమీవ్రతాన్ని పాటించాలనీ పరమాత్మ మహర్షికి ధ్యానంలో బోధించాడు. ఆ మునిదంపతులు అదేవిధంగా ఋషిపంచమీవ్రతాన్ని ఆచరించారు. దాంతో ఆమె శుచిమంతురాలైంది. ఆ తర్వాత వారు జీవితాంతం ఈ వ్రతాన్ని ఆచరించారు. ఇదీ వ్రతకథ.

**ఆగష్టు, 26న ఋషిపంచమి సందర్భంగా...**

ఋషిపంచమినాడు సప్తరులగురించి తెలుసుకోవడంకూడా వ్రతంలో భాగమే. వామనావతార ఘట్టాన్ని పారాయణం చేయడం మంచిది.







# 2017 జూలై 02 నుండి 09 వరకు విజయవాడలో



సుప్రభాతం



అర్చన



కొలువు



శుక్రవారాభిషేకం



నిజపాదదర్శనం



తిరుప్పావడసేవ



నేత్రదర్శనం



కల్యాణోత్సవం



సహస్రదీపాలంకారసేవ



వైభవోత్సవాల్లో భక్తులు

# జరిగిన శ్రీవారి వైభవోత్సవాలు


అష్టదళపాదపద్మారాధన


భోగశ్రీనివాసునికి అభిషేకం


సహస్రకలశాభిషేకం


తోమాలసేవ


లక్ష్మీస్తోత్రం


స్నపన తిరుమంజనం


ఊంజలసేవ


పుష్పయాగం


శ్రీవారిదివ్యప్రసాదాలు స్వీకరిస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రివర్యులు


వైభవోత్సవాల్లో భక్తులు







జ్యోతిప్రజ్వలన చేస్తున్న తి.తి.దే. కార్యనిర్వహణాధికారి



సంపాదకమండలి సభ్యులు ఆచార్య శలాక రఘునాథశర్మగారికి సత్కారం



ప్రచురణల విభాగం పూర్వ అధికారి ఆచార్య రవ్వాశ్రీహరిగారికి సత్కారం



భాగవత ప్రధానసంపాదకులు డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారికి సత్కారం



భాగవతవ్యాఖ్యాతలు - సంపాదకమండలి సభ్యులు



కుమారి పవిత్ర - భరతనాట్యం





వ్యాఖ్యాతలను సత్కరిస్తున్న ఉన్నతాధికారులు

తి.తి.దే. ప్రచురించిన బమ్మెర పోతనామాత్య ప్రణీత శ్రీమహాభాగవతం (సరళవ్యాఖ్యానం) గ్రంథావిష్కరణ సందర్భంగా
తిరుపతి అన్నమాచార్య కళామందిరంలో రెండు రోజుల పాటు నిర్వహించిన "భాగవత సదస్సు - పండిత సత్కారం" కార్యక్రమ దృశ్యమాలిక

# శ్రీహయగ్రీవాయనమః

– విద్వాన్, డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య



విష్ణుదేవుడు లోకశ్రేయస్సును కోరి, మొట్టమొదట హయగ్రీవుడై అవతరించాడు. **ఇది జ్ఞానావతారం.** వాసుదేవుని అన్ని అవతారాల్లో ఇదే మొట్టమొదటిది. అన్నిటికీ మూలం జ్ఞానమే! హయగ్రీవుడంటే గుర్రంమెడవంటిమెడ కలవాడు. గుర్రం సకిలించేధ్వనిని 'హేష' అంటారు. ఈ ధ్వని ప్రణవరూపంగా భగవంతుడైన హయగ్రీవస్వామినుండి వెలువడింది.

కనుక ఈ హేషాధ్వనిప్రభావం మహత్తరం. సృష్టియజ్ఞంలో విరాడ్రూపునినుండి మొట్టమొదట వెలువడింది – అశ్వం. "తస్మాదశ్వా అజాయంత" (పురుషసూక్తం) అని వేదం పేర్కొనింది. హయమంటే శీఘ్రంగా పోయే దని వ్యుత్పత్తి. సృష్టిలో మొదటిరూపం కనుక హయగ్రీవావతారాన్ని భగవంతుని ప్రథమావతారంగా మహర్షులు నుతించారు.

'హేషా' అంటే అవ్యక్తంగా మ్రోగేది. సాక్షాద్విష్ణువే ఈ హయగ్రీవస్వామి కనుక సర్వత్ర గమనశక్తి, సర్వవ్యాపకత్వం, శీఘ్రగామిత్వం కల్గి, ప్రణవ (ఓంకారం) స్వరూపుడై– హయగ్రీవుడు జ్ఞానదాత అయిన ఆదిగురువు అయ్యాడు. ఈ స్వామి విద్యామూర్తి. ఈయన జ్ఞానానందమయుడు. నిర్మలమైన స్ఫటికంవంటి ఆకారం కలవాడు. సర్వవిద్యలకూ ఆధారమైనవాడు.

హయగ్రీవు డనేరాక్షసుణ్ణి ఈ రూపంతో సంహరించాడనీ, మధుకైటభుల్ని ఈ రూపంతో కూల్చి, వేదాలు ఉద్ధరించాడనీ పురాణాలు పేర్కొన్నాయి.

**హయగ్రీవస్వామిని పూజించడానికై మొదట బ్రహ్మ తన భార్యయైన సరస్వతిని నియమించాడు. ఆమె ఈ మూర్తికి విగ్రహరూపం కల్పించుకొని పూజించింది. శ్రీరామానుజులవారూ, శ్రీవాదిరాజులవారూ ఈస్వామిని సేవించే మహాజ్ఞానులయ్యారు.**

**2017, ఆగష్టు 07 న శ్రీ హయగ్రీవ జయంతి సందర్భంగా..**

సరస్వతి రామానుజులవారికి సాక్షాత్కరించి, కాశ్మీరంలో శ్రీలక్ష్మీహయగ్రీవమూర్తిని ప్రసాదించింది. వారినుండి – వారిశిష్యులు పిళ్లైగారికి, వారినుండి వేదాంతదేశికులవారికీ గురుశిష్యక్రమంలో సంక్రమించింది. ఆ దివ్యవిగ్రహమే నేడు మైసూరులోని శ్రీ బ్రహ్మతంత్రస్వతంత్రపరకాల మఠంలో ఆచార్యులచే అర్చించబడుతూంది. ఇలా భూలోకంలో హయగ్రీవమూర్తిపూజ మొదలైంది.

వేదాంతదేశికులవారు శ్రీహయగ్రీవస్తోత్రంలో హయగ్రీవస్వామిని త్రిమూర్త్యాత్మకునిగా, అందుకు మూలమైన పరమాత్మగా నుతించారు. దేవలోకంలోనూ, భూలోకంలోనూ జ్ఞానమూర్తిగా, జ్ఞానదాతగా గురుస్థానీయుడై నతులూ, నుతులూ అందుకొన్న ఆదిగురువు – హయగ్రీవులవారు. ఈ ఆదిగురువును ఉపాసించేవారికి భౌతికవిద్యలే కాక– పురుషుడు పురుషోత్తముడు కాగల ఆధ్యాత్మికజ్ఞానమూ సిద్ధిస్తుంది. సంసారసముద్రాన్ని దాటడానికి హయగ్రీవుని దయ నావ. హయగ్రీవస్వామివారిఆలయాలూ, మందిరాలూ ఉన్నాయి.

విద్యార్థులు ప్రతిదినం ఉదయం–

**జ్ఞానానందమయం దేవం, నిర్మలస్ఫటికాకృతిమ్ ।**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే**

అని నుతించడంవల్ల ఉత్తమవిద్యాసంపన్నులు కాగలరు.






# జయవిజయులే దర్శనం చేయించారు

- శ్రీ పెనిజర్ల మోహన్

అది 2008వ సంవత్సరం... తిరుమల కొండ.. నవంబర్ మాసం... చిక్కటి చలికాలం...

మా అబ్బాయి పుట్టి సంవత్సరం, సంవత్సరంలోపే శ్రీవారిదర్శనం చేసుకోవాలని అనుకున్నాను. అనుకున్న ప్రతీసారి ఏదో ఒక ఆటంకం. చివరికి ఒకరోజు మా నాన్నతో అనేశాను.... "ఏంటి నాన్నా ఇది. వెళ్లామనుకున్నప్పుడల్లా ఏదో అడ్డంకి.. ఎందుకిలా?" అని.

ఆయనన్నారు.. "చూడ్రా, అది మామూలు ప్రదేశం కాదు, భూలోకవైకుంఠం. నువ్వు వెళ్లాలనుకోగానే వెళ్లలేవు... ఆ స్వామి అనుమతించి దయతలిస్తేమాత్రమే వెళ్లగలవు" అన్నారు.

ఆయన నోటిమాటో, ఆ స్వామి దయదలచాడో కానీ, సాయంత్రమే మా బావగారి నుంచి ఫోన్. వాళ్లు స్వామివారికల్యాణంకోసం రెండు టిక్కెట్లు బుక్ చేసుకున్నారని, మా మావయ్య ఆరోగ్యం బాగోక వెళ్లలేకపోతున్నారని, వెళ్లడానికి మీకు వీలుంటే ఆ కల్యాణం టిక్కెట్లు మీకు పంపిస్తాననీ.... ఆ ఫోన్ సారాంశం.

ఆహా..! భగవంతుడా, ఇలాకూడా దయదలచావా స్వామీ...! దర్శనంకోసం పరితపిస్తే, ఏకంగా నీ కల్యాణం చూసే భాగ్యమా... నా ఫ్రెండ్ అనేవాడు "భగవాన్ జబ్ దేతాహై తో చప్పర్ ఫాడ్ కే దేతాహై" అని.

మొత్తానికి సెలవులూ, రైలుటిక్కెట్లు అన్నీ చకచకా కుదిరి వారంరోజుల తరువాత తిరుమల బయలుదేరాం. తరువాత రోజు కొండమీద దిగాం. మరుసటిరోజు ఉదయం కల్యాణానికి హాజరవ్వాలి. కాబట్టి ఆ రోజు నాకు ఇష్టమైన జాబాలిసన్నిధిలో గడిపేశా. సాయంత్రంలోపు పాపనాశనం, శ్రీవారిపాదాలు చూచి, తిరిగొచ్చాం. అలిసిపోయాం కానీ, కొండమీద తిరగాలనేకోరిక గదిలో ఉండనివ్వలేదు. అమ్మా నాన్నను విశ్రాంతి తీసుకొమ్మని చెప్పి నేనూ, మా ఆవిడ, మా బుడంకాయ్ బయటపడ్డాం.

అలా షాపింగ్ చేస్తుంటే ఓ వేంకటేశ్వరస్వామి పటం మీద నా దృష్టిపడింది. ఎందుకోగానీ బాగా నచ్చింది. బేరం చేస్తుండగానే ఓ మహిళకూడా అదే పటం కావాలని అడిగింది. అక్కడ స్వామివారి చాలా ఫోటోలున్నా అది చందనసేవ ఫోటో అనుకుంటా... కొంచెం ప్రత్యేకంగా అనిపించింది. అందుకేనేమో తనుకూడా ఆ ఫోటోనే కావాలంది.

అప్పుడు పరీక్షగా చూశాను– ఆ మహిళను. స్వచ్ఛంగా నిమ్మపండురంగులో ఉంది. సంప్రదాయం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. ఆకుపచ్చ రంగుచీర. నుదుటబొట్టు తప్ప ఏ అలంకరణ లేదు. అయినా ముఖంలో రాజసం ఉట్టిపడుతూంది. మాకు గౌరవభావం కలిగింది. అందుకే "ఫోటో మీరే తీసుకోండి" అన్నాను–మర్యాదగా. "కాదు కాదు, మీరే తీసుకోండి" అంటూ ఆమె నిరాకరించారు. కాసేపు తర్జనభర్జన తరువాత మొత్తానికి ఫోటో నేనే తీసుకున్నాను. ఆ తరువాత చిన్న మర్యాదపూర్వక సంభాషణ. ఆ సందర్భంలో తనది పుత్తూరు దగ్గర నారాయణవనం అని తెలిసింది. అదే సమయంలో తను మాకో విషయం చెప్పారు. అదే సుపథంపథకం. చంటి పిల్లలతల్లులకు మహాద్వారం నుంచి దర్శనం ఉంటుందని, ఎనిమిదిగంటలకల్లా క్యూలో ఉంటే నేరుగా దర్శనం చేసుకోవచ్చని... వెంటనే వెళ్లమని...

సమయం చూస్తే దాదాపు ఎనిమిదవుతోంది. అయినా వెళ్లడానికే నిర్ణయించుకున్నాం. ఆమెకు కృతజ్ఞతలు చెప్పి, హడావుడిగా మహాద్వారంవద్దకు చేరుకున్నాం. అప్పటికే రాత్రి తొమ్మిది దాటింది. అయినప్పటికీ అక్కడ బయట షెడ్డులో చాలామందిజనం ఉన్నారు. వృద్ధులు, వికలాంగులుకూడా ఆ షెడ్డు వద్దే నిలబడి స్వామిదర్శనంకోసం ఎదురుచూస్తున్నారు. ఎవరో వీఐపీ రావడంవల్ల దర్శనం ఆపారని వారిమాటలవల్ల తెలిసింది మాకు.

హమ్మయ్య! మనకు స్వామివారి దర్శనభాగ్యం ఉందన్నమాట! ఆ వీఐపీ పుణ్యమా అని ఆలస్యం కావడమూ మనకు కలిసొచ్చింది – అనుకున్నాం. కానీ రాత్రి పది గంటలవుతున్నా దర్శనానికిమాత్రం పిలుపు రాలేదు. ఒకవైపు చలి. మా అబ్బాయికి స్వెట్టరు బందోబస్తు ఉన్నా మేమిద్దరం గదికి వెళ్లిపోదామనుకున్నాం కాబట్టి ఏం తెచ్చుకోలేదు.

ఇంతలో ఎవరో బాంబు పేల్చారు. 'సుపథం' కేవలం చంటిబిడ్డతల్లికి మాత్రమేనని, తండ్రిని అనుమతించరని. "చచ్చాంపో... ఇప్పుడెలా...?" – అన్నాను నేను. మా ఆవిడలో అయోమయం.. అరుదుగా వచ్చే అవకాశం! అలాగని ఒక్కతీ వెళ్లలేదు. దాంతో బిక్కమొహం వేసింది. "ఓ పనిచెయ్యి.... నువ్వెళ్లి వచ్చేయ్. నేను





ఇక్కడే ఎదురు చూస్తుంటా..." అని ధైర్యం చెప్పాను. తాను ససేమిరా అంది. ఒక్కదాన్నీ వెళ్లలేననీ, వాడిని మోయలేననీ అని రకరకాలకారణాలు చెబుతోంది. "అలా కాదు, జన్మకోశివరాత్రిలా ఈ అవకాశం మళ్లీ మళ్లీ రాదు, వేరే ఏం ఆలోచించకు! వెళ్లిరా...!!" అన్నాన్నేను.

ఎందుకోగానీ తాను మొండికేసింది. సాధారణంగా నేను చెబితే కాదనదు. ఆ జనం, హడావుడి చూచి, భయపడుతుందను కున్నా... నేనెంత సర్దిచెప్పినా వినడానికి సిద్ధంగా లేదు. చివరికి "మీరు వస్తే వెళతా, లేదంటే వెనక్కి వెళ్లిపోదాం..." అని ధైర్యంగా అనేసింది. నాకు చాలా బాధేసింది. రాకరాక అవకాశం. ఆ దేవదేవుణ్ణి దర్శించుకునే అవకాశం.. వచ్చినట్లే వచ్చి చేజారిపోతోందన బాధ. ఇక తనను ఇబ్బందిపెట్టి లాభంలేదు. భగవంతుడు ఎలా శాసిస్తే అలా జరుగుతుందని మనసులో అనుకుని లేచి నిలబడ్డాను. మా అబ్బాయిని చేతుల్లోకి తీసుకుని, వెనక్కి వెళ్లిపోవడానికి సిద్ధమై.. రెండడుగులు ముందుకువేశాను.

అదిగో.. అప్పుడొచ్చాడు... ఐదున్నర అడుగుల ఎత్తుంటాడు. చామనఛాయ. అయినా ముఖంమాత్రం ఎంతో కళగా, నిర్మలంగా ఉంది. తీర్చిదిద్దినట్టుగా తిరునామాలు. తెల్లటిపంచె. పైన తెల్లటి షర్ట్. బ్యాంకు పాస్‌బుక్ లాగా నల్లటిఅట్టతో చేతిలో ఏదో పుస్తకం. వేగంగా అడుగులు వేస్తూ నేరుగా మా దగ్గరకే వచ్చాడు. అడుగుదూరంలో ఉండగానే నేరుగా కళ్లలో కళ్లుపెట్టి "మీరు దర్శనానికి వెళ్తున్నారా" అని ప్రశ్నించాడు. ఈ పరిణామాన్ని ఊహించని నేను తల అడ్డంగా, నిలువుగా తరువాత అటూ ఇటూ కాకుండా ఊపాను.

ఆయన చిన్నగా నవ్వుకుంటూనే నేరుగా విషయం చెప్పాడు. "చూడండీ.. నా పేరు జయప్ప. దర్శనం విషయంలో మీరు తర్జన భర్జన పడుతుండడం చూశాను. నా దగ్గర వికలాంగుల పాస్ ఉంది. నేనూ మహాద్వార దర్శనంకోసమే వచ్చాను. ఒక్కడినే ఉన్నా.. అయితే నాతో పాటు ఒకరు తోడుగా రావొచ్చు... మీకు అభ్యంతరం లేకపోతే మీరు నాకు తోడుగా వచ్చానని చెప్పి లోపలికి రండి.." అని గుక్క తిప్పుకోకుండా గబగబా చెప్పాడు. ఆయనమాటలు వింటుంటే ఏదో స్తోత్రం వింటున్నట్టు అనిపిస్తోంది. చూస్తే వికలాంగుడిలా అనిపించడం లేదు. తోడు అవసరమూ కనిపించడం లేదు. ఏం చేయాలా? అని ఆలోచిస్తూ నిలుచుండిపోయాను.

"ఏం ఆలోచిస్తున్నారు? త్వరగా రండి" అన్నాడు. "అదికాదు, ఇలా అబద్ధం చెప్పడం సరికాదు కదా అని ఆలోచిస్తున్నాను.." అన్నాను– నేను."ధర్మాధర్మవిచక్షణ బాగనే చేస్తున్నావే... ధర్మరాజుకన్నా గొప్పవాడివా? చిన్న అబద్ధమేగా... అయినా, నాకు నిజంగానే తోడు కావాలి" అన్నాడతను. "చిన్నదేగానీ, అది ఇక్కడ కాదు. పవిత్రమైన ఈ కొండమీద తప్పుగా ఆలోచించడానికే సాహసించలేను.. అలాంటిది ఆ పావనమూర్తివాకిట్లో అబద్ధం ఆడటమా, నా వల్ల కాదు" అనేశాను. ఈసారి కాస్త పెద్దగానే నవ్వాడు. కానీ ఏం మాట్లాడలేదు.

కాస్త చనువు తీసుకుంటూ తన ఎడమచేతితో నా కుడిచేతి మణికట్టు వద్ద పట్టుకున్నాడు. ఒక్క క్షణం ఒళ్లు జలదరించింది. ఆ మరుక్షణమే మహాద్వారం వద్ద క్యూలైన్ తెరుచుకుంది. ఆ తరువాత నేను ఏం ఆలోచించడానికి నా మనస్సు నా అదుపులో లేదు. అతను, అతనివెంట నేను, నా వెనుక మా ఆవిడ. గాలిలో తేలినట్టుగా... అందరినీ దాటుకుంటూ క్షణాల్లో అక్కడికి చేరుకున్నాం. ఇంతలో నేనే అడిగాను. "అవునూ, అక్కడ ఎవరూ అడగరా? అదే.. నేను మీకు



తోడుగా వచ్చానని ఎలా నమ్ముతారు?" అని ప్రశ్నించాను. "నమ్మరు, కొన్నిసార్లు అడుగుతారు. ముందు నన్ను వదిలేసి మిమ్మల్ని ఆపి, నా పేరు ఏమిటి? ఏఊరి నుంచి వచ్చారు?" అని అడుగుతారు. పేరు, ఊరిపేరు సరిగా చెబితేనే మిమ్మల్ని లోపలికి వదులుతారు" అని చెప్పాడు. "మరి, మీ పేరు, ఊరు ఏమిటి, నాకు చెప్పరా" అన్నాను. ఈసారి కూడా గట్టిగానే నవ్వాడు.. కానీ కొంత సంభ్రమంగా ఉందా నవ్వు.

"సరే, నా పేరు జయప్ప. ఊరు తీర్థం. అడిగితే అదే చెప్పు" అన్నాడు. ఆయన దగ్గరున్నపుస్తకంలో అలా రాసుందేమో అనుకున్నాను. తీర్థం, ప్రసాదం అనికూడా ఊరిపేర్లుంటాయా? మనసులో అనుకున్నాను. మనసులో పేర్లు గుర్తు పెట్టుకునే ప్రయత్నం చేస్తున్నాను. అంతలోనే మహాద్వారం దాటామన్న సంగతికూడా నాకు తెలీలేదు. ఆశ్చర్యంగా ఉంది. అంతవేగంగా నడిస్తే ఆయాసం రావాలి. కానీ నాకు అలాంటిదేమీ లేదు.

అలా నడుస్తూ మొత్తానికి స్వామివారిసన్నిధిలోకి చేరుకున్నాం. చాలా జాగ్రత్తగా ఆయన నన్ను పట్టుకున్నాడు. స్వామివారు కొండమీదకు ఎలా వచ్చిందీ, తిరుమల కొండవిశేషాలు చెబుతున్నాడు. అలా నడుస్తూ స్వామివారికి మరింత దగ్గరయ్యాం. ఇంకా 20 అడుగుల దూరంమాత్రమే ఉంది.

"చూడు, ఆ లైన్‌లో వెళితే స్వామివారిదర్శనం క్షణకాలం మాత్రమే ఉంటుంది. ఈ ఎదురుగా ఉన్న లైన్‌లోంచి వెళ్తే ఎక్కువ సేపు స్వామిదర్శనం చేసుకోవచ్చు" అంటూ నన్ను ఎదురుగా ఉన్నలైన్ లోకి తీసుకెళ్లాడు. నిజమే! ఆ లైన్‌లో నిలబడితే క్యూ ముందుకు కదిలేదాకా స్వామిదర్శనం చేసుకోవచ్చు.

"స్వామి దర్శనానికి తపిస్తూ కొండమీదకు వచ్చావు. ఇక్కడ కళ్లు మూసుకుని ఆ ఆనందాన్ని కోల్పోకు. చివరివరకు కళ్లు విప్పార్చుకునే ఉండు. ఆ దివ్యమంగళస్వరూపాన్ని శాశ్వతంగా నీ కళ్లలో నిక్షిప్తం చేసుకో" అంటూ హెచ్చరించినట్టుగా చెప్పాడు.

"అలాగే" అన్నాను కానీ, ఆయనవైపుమాత్రం చూడలేదు. నా దృష్టి అప్పటికే స్వామివారిమీద ఉంది. ఆయన చెప్పినట్టే ఆ కోనేటిరాయుడిని దాదాపు నిమిషంపైనే దర్శించుకున్నాను. ఆ అనుభూతిని మాత్రం మాటల్లో చెప్పలేను. అద్భుతమైన ఆ దివ్య మంగళస్వరూపాన్ని దర్శించుకున్న తరువాత ఏదో మైకం కమ్మేసింది. ఆ మత్తులోనే బయటకొచ్చాను.

బంగారుబావిదగ్గరకొచ్చాక మా ఆవిడ "ఏమిటంటీ, మీ ఆవేశం.. మేమున్నామని గుర్తుందా... మీకసలు....! అనింది.

అప్పుడు ఈ లోకంలోకి వచ్చాన్నేను. దర్శనానికి సహకరించిన జయప్పకు కృతజ్ఞతలు చెప్పాలనే ఆలోచన అప్పుడు వచ్చింది.

అవునూ, 'మనల్ని తీసుకొచ్చాడే జయ్యప్ప... అతనేడి? అని అడిగాను. 'అతనా? ఏమో నాకేం తెలుసు. నేను ఆయన్ని షెడ్డు దగ్గరే చూశాను. మళ్లీ చూడలేదు'. అంది మా ఆవిడ. కళ్లింత చేసుకుని ఆశ్చర్యంగా చూశాను – మా ఆవిడ వేపు!

అదేమిటి? ఇంతసేపూ నాతోపాటే ఉన్నాడుగా? నువ్వు చూడ లేదా? అలా అడుగుతూనే ఏదో స్ఫురించినవాడిలా అంతలోనే వెంటనే పరిగెత్తాను.

విమానవేంకటేశ్వరుణ్ణి దాటి ఇంకా ముందుకు... మరింత వేగంగా, ఆలయంముందువైపునకు... పరిగెడుతూనే ఉన్నా...

ఊహూ... లేదు.. అంత వేగంగా అతను వెళ్లే అవకాశమూ లేదు.. అయినా కనిపించనూ లేదు. వెనక్కి వచ్చాను.. ఆయాసంతో రొప్పుతూ... (మా ఆవిడ ఆశ్చర్యంగా చూస్తూనే ఉంది.)

ఇద్దరం చిన్నగా నడుస్తూ ప్రసాదం తీసుకుని ఆలయం బయటికొచ్చాం. ఏం మాట్లాడకుండా నేరుగా గదికెళ్లిపోయాం...

అప్పటికి సమయం 12 దాటింది. మా అమ్మ మేలుకునే ఉంది. కాస్త కంగారుగా అడుగుతోంది. "ఎక్కడికెళ్లారురా? చంటిబిడ్డ ఉన్నాడు.. చలికాలం.. ఆలోచించే పనిలేదా.." అని అడుగుతోంది.

నేనేమీ వినిపించుకోలేదు.. నేరుగా మా నాన్న దగ్గరకు వెళ్లా... అంటూ జరిగింది పూసగుచ్చినట్టు చెప్పేశా.. ఆయన సావధానంగా విని కళ్లు మూసుకున్నారు... అయిదు నిమిషాల తరువాత కళ్లుతెరిచి మాట్లాడారు.

"నువ్వు ఆయన దర్శనంకోసం ఎంత తపించావో ఆ స్వామి గుర్తించాడురా! అందుకే షాపింగ్‌సెంటర్ దగ్గర అమ్మవారు నీ దారి మళ్లించారు. స్వామివారి ద్వారపాలకులే జయుడు. విజయుడు. ఆయనే స్వామివారి ఆజ్ఞతో నిన్ను దర్శనంకోసం తీసుకెళ్లాడు. అందుకే తన పేరు జయప్ప అని చెప్పాడు. పొద్దున్న తీరిగ్గా ఆలోచించు... విషయం నీకే బోధపడుతుంది" అన్నారు.

అవునా? స్వామి దయతలిస్తే ఇలా ఉంటుందా? అనుకుంటూ... జయప్ప పట్టుకున్న నా మణికట్టును పదేపదే చూసుకుంటూ నిద్రలోకి జారిపోయా...

నిజం చెప్పాలంటే, రాత్రి అంతసేపుచూసిన ఆ మనిషి పోలికలు పొద్దున లేచేసరికి నాకు గుర్తులేవు.... అంతా ట్రాన్స్‌లో అయిపోయినట్టుంది...







# కైంకర్యమే.. తనువు దాల్చితే....

16

- డా॥ కంపల్లె రవిచంద్రన్



**(మధురకవులు శ్రీనమ్మాళ్వార్లవారిని ఆచార్యులుగా స్వీకరించడం ఈ సంచికలో చదువవచ్చు)**

మధురకవులకు రామాయణంలో విశ్వామిత్రయాగ సంరక్షణ ఘట్టం కళ్లముందు తెరలుతెరలుగా కదలాడింది.

ఒకరోజు అయోధ్యానగరానికి విశ్వామిత్రమహాముని వచ్చాడు. ద్వారపాలకుడు ఆ విషయాన్ని నివేదించాడు. అందరూ సంభ్రాంతులయ్యారు. ఎందుకని?

ఆయనరాకను ఎవరూ ఊహించలేదు. వెంటనే దశరథుడు పురోహితులతో కలిసి ఎదురువెళ్లాడు.

ఇంద్రుడు బ్రహ్మదేవునకు స్వాగతం చెప్పి, తీసికొని వచ్చినట్లు తీసికొనివచ్చాడు. అర్ఘ్యపాద్యాదులతో గౌరవించాడు. విశ్వామిత్రుడుకూడా దశరథునిపురం, కోశం, జనపదాలు బంధువులు స్నేహితులు మొదలైనవారి క్షేమాన్ని అడిగాడు.

"దైవసంబంధమైన నీకర్మ నిర్విఘ్నంగా కొనసాగుతున్నదా! అని అడిగి వశిష్ఠమహర్షి దగ్గరకువెళ్లి ఆయన కుశలాన్ని అడిగి ఆతర్వాత ఇతరఋషిపుంగవులక్షేమాన్ని తెలుసుకొన్నాడు. అందరూ సంతోషించారు. దశరథుడు చాలా సంతోషించాడు. "మీరాక అమృత ప్రాప్తిలా ఉంది. అనావృష్టిక్షామంలో వర్షం కురిసినట్లు ఉంది. సంతానరహితునికి సదృశభార్యలయందు పుత్రజన్మ కలిగినట్లుంది. నష్టపోయినవానికి లాభం వచ్చినట్లు ఉత్సవరూపహర్షం కురిసినట్లూ ఉంది. ఇవన్నీ దశరథుడు అతి సమీపంలో అనుభవిస్తూన్న ఆనందాలు. ఆ అనుభూతిని ఆయన యెరుగుదుడు. అప్పుడు మహర్షిరాక వల్ల వచ్చిన ఆనందాన్ని వాటితో పోల్చుకొంటున్నాడు. అందుకని "స్వాగతం తే మహా మునే" అని మీరాకే మాకు 'రాక' అంటే పున్నమివెన్నెలకదా!"అని ఆనందాన్ని ప్రకటించాడు. అంతే కాదు– "ఇప్పటికి నాపుట్టుక సఫలమైంది. నా నడవడికకు చరితార్థత వచ్చింది. పూర్వం రాజర్షి శబ్దంచేతనే తేజోవంతుడవు. ఇప్పుడు బ్రహ్మర్షిత్వాన్ని పొంది, నాచేత పూజింపదగిన వాడవయ్యావు." అంటే విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అయిన తర్వాత ఇంత వరకు దశరథునివద్దకు రాలేదన్న మాట. మీరు ఏది అడిగితే మీవృద్ధి కోసం ఆపనిచేస్తాను. అని దశరథుడంటూన్నా ఇంకా విశ్వామిత్రునికి విశ్వాసం కుదరటం లేదు.

దాన్ని కనిపెట్టి దశరథుడంటున్నాడు – "కార్యం విషయంలో సంశయాన్ని పొందకండి. ఎటువంటి కార్యానికైనా నేను కర్తను. రోహిణీశకటాన్ని ఛేదించి, శనిని విముక్తుణ్ణి చేసిన వాడను" అదీ పరమాహంకారం.

మరొకమాట "మీరు నాకు దైవం. కనుక ఏం చెప్పినా చేస్తాను." దశరథుడు మాటమీద మాటనిస్తున్నాడు. అతననుభవిస్తూన్న ఆనందంలో ఇతరఆలోచనలు లేవు. ఒకటికి రెండుసార్లు అనిపిస్తున్నాడు – విశ్వామిత్రుడు.

దశరథుడు సాత్త్వికుడే అయినా – ఈమధ్యకాలంలో తాను అనుభవిస్తూన్న ఆనందం రాజసాన్ని పెంచింది. అందుకనే– "నేను నిన్ననుగ్రహిస్తున్నాను. కోరుకో. సందేహం లేదు" అనే విధంగా మాట్లాడాడు. అయినా విశ్వామిత్రుడు కోపగించుకోలేదు. ఎందుకని?

ఆ అహంకారంలోకూడా స్వభావసిద్ధమైన సాత్వికత ఒకటుంది. అది "మీరు నాకు దైవం" అనటం. భగవంతునికి నివేదనం చేస్తే వస్తువు శుద్ధి అయినట్లు ఈ అహంకారమంతా అందులో లీనమైపోయింది. విశ్వామిత్రునకు ఈ మాటచాలు. అందుకని దశరథునిమాట హృదయసుఖమే అయింది. వినడానికి ఇంపుగానే ఉందట! బుద్ధిమత్త్వం, వినయం కనబడ్డాయట! కీర్తిమంతుడైన ఆ పరమర్షి అత్యంతానందాన్ని పొందాడట!



ఆపదలలో నిజమైన స్నేహమెవరిదో తెలుస్తుంది

ఇప్పుడు మహర్షి పూచిన లతలా ఉన్నాడు. ఆయన మనో రథం పుష్పిస్తోంది. విశ్వామిత్రుడు వాక్యకోవిదుడు. అందువల్ల దశ రథుని వాక్యవిన్యాసానికి తగినట్లుగానే రెండు మాటలు మాట్లా డాడు. ఒకటి– "రాజా! మహావంశంలో పుట్టిన వాడివి. వశిష్ఠుడు కులగురువుగా కలవాడివి. నీవంటివాడు మరొకడు ఈ భువిలో లేడు." ఇదొకమాట.

"నా హృదయగతవాక్యం ఏదైతే ఉందో, ఆ కార్యమందు నిశ్చయస్థితిని పొందు. సత్యప్రతిజ్ఞడవు కమ్ము" అని. ఇక్కడ విశ్వా మిత్రుడు రెండు మాటల్లోనూ దశరథుణ్ణి రెండుసార్లు రాజశార్దూలా! అని సంబోధించాడు. అన్నమాటను కాదని నన్ను హింసింపకు అనే భావం ఇందులో ఉంది. అంతేకాదు – దశరథుని కీర్తికి కారణమైన మాట ఇదే. సరే –

"నాది దశరాత్రదీక్ష నేను వ్రతంలో ఉండగా ఏడవ రోజున మారీచ, సుబాహులనే ఇద్దరు రాక్షసులు యజ్ఞవేదిలో మాంసంతో రక్తాన్ని వర్షింపచేస్తున్నారు. ఆ ఇద్దరూ వీర్యవంతులు, సుశిక్షితులు. సుశిక్షితత్వమంటే ఏమిటి ఏ పనిని ఎప్పుడు పాడుచేస్తే మొత్తమంతా పాడవుతుందో దాన్ని తెలిసికొనడం.

కొన్ని వ్రతాల్ని మధ్యలో పాడుచేస్తే మళ్ళీ ప్రారంభించాలి. మరికొన్నిటిని చివరలో. ఇలా ఈ విషయమై శిక్షణ ఇవ్వటం. వీళ్ళి ద్దరూ అటువంటి శిక్షణను పొందినవాళ్ళు. అటువంటి మారీచ, సుబాహులను శపిద్దామంటే బుద్ధిపుట్టదు. ఆ సందర్భం కోపానికి శాపానికి తగింది కాదు. ఒక మంచి కార్యంలో ఉన్నప్పుడు కార్యకర్త జితక్రోధుడు కావాలి. కాకుంటే ఆ కార్యం ఫలించదు అదీ విశ్వా మిత్రుని బాధ. కనుక –

**స్వపుత్రం రాజశార్దూలం రామం సత్యపరాక్రమం**
**కాకపక్షధరం శూరం జ్యేష్ఠం మే దాతు మర్హసి** - అన్నాడు.

ఇంకా కాకపక్షధరుడు. పిల్లజుట్టు పోలేదు. అయినా శూరుడు. సత్యపరాక్రముడు. అటువంటి నీ జ్యేష్ఠసుతుణ్ణి నాకివ్వు. ఇలా అంటూ విశ్వామిత్రుడొకమాట అన్నాడు. ఏమని? 'స్వపుత్రం' ఈ విశ్వంలో ఎవడు రాముణ్ణి కుమారునిగా భావిస్తే వానికే ఆయన కొడుకు. రాముడు దశరథపుత్రుడు మాత్రమే కాదు. పుత్రుడు నరకాన్నుండి కాపాడతాడు అని అనుకుంటే, ఆ నరకం పరానికే కాదు ఇహానికి సంబంధించింది కూడా.

కనుక నాయనా! కుమారుణ్ణి మాకివ్వు. వాడివలన కావలసిన పని ఉంది. మహాపురుషుడు ఏ ఒక్క ఇంటికీ పరి మితం కాడు. అందుకే రామవియోగం ప్రాప్తించినప్పుడు ప్రజ లందరూ తమ ఇంటి పెద్దకొడుకుతో వియోగం ఏర్పడినట్టు ఏడ్చారు. అందుకే విశ్వామిత్రుడు "స్వపుత్రం శూరం జ్యేష్ఠం" అన్నాడు. అందరికీ పెద్దకొడుకు రాముడే. రామునిలో ఈవేళ చూడవలసింది శూరం. పూర్వం మనకు ఒక సంప్రదాయం ఉండేది. ఆ సంప్రదాయంలో ఇంటి యజమాని ఎవరంటే – కుల దైవాన్ని చెప్పేవారు. ఆనాడు ఇదంతా సంస్కృతి. రాముడు అలాంటివాడు. "రఘువంశరాజులు అలాంటివారు. అందువల్ల రాముణ్ణి పంపించు. నా దివ్యతేజస్సుతో రాముణ్ణి రక్షిస్తూ ఉంటాను. అంతేకాదు – వానికి అనేక శ్రేయస్సుల్నిస్తాను. మూడులోకాల్లోనూ కీర్తిని సంపాదించే శ్రేయస్సుల్ని కలుగజేస్తాను."

విశ్వామిత్రుని రాకకు ముందు దశరథుడేమి ఆలోచిస్తు న్నాడో – అది.

అది సదృశ భార్యావిషయకం

అదిగో అది నేను కలిగిస్తాను. వీళ్లకు మంచి సంబంధాల్ని నీవు చూడలేవు. నిజమే –

దశరథుడు వెదకి ఉంటే – అది ఏమై ఉండేదో. దశరథుని తలంపుతో ఉన్న కార్యం భంగమైనా అది తండ్రీకొడుకుల శాశ్వత కీర్తికే కారణమౌతూ వచ్చింది.

ఈ సంఘటన ఒకటి–పట్టాభిషేకమొకటి!

ఎందుకయ్యా! రాముణ్ణే అడుగుతున్నావు. అంటే – రాముడు కానివాడు వాళ్లను చంపడానికి ముందడుగే వేయలేడు. పుత్రస్నేహంతో అడ్డుపెట్టడానికి ప్రయత్నించకు. ఆ రాక్షసులు చచ్చిపోయినట్లే– రాముడు బయలుదేరితే. అంతగా ఎలా చెప్ప గలవంటావేమో.

రాముణ్ణి నేనెరుగుదును. అంటే–నీవెరుగవనే అర్థం కదా!

అయితే, నేనంటే– బహుగురూపాసన చేత లబ్ధజ్ఞానిని

యోగప్రభావం వల్ల సాక్షాత్కరింపచేసికొన్న పరాపరతత్త్వ యధార్థ స్వరూపం కలవాడిని.

సాత్త్వికి ప్రవృత్తికి చిహ్నమైన జటావల్కలాలను ధరించిన వాడిని, గర్భభూతాస్తపోధనాః – అన్నట్లు రాముని గర్భమందున్న వాడిని, యోగక్రమజ్ఞానమున్న వాడిని, మోక్షకామేష్టిని చేసిన వాడిని, ధర్మమోక్షపరుడిని– అటువంటి వారిని నేనెరుగుదును.

(ఇంకా ఉంది)





# స్నేహం

- శ్రీ కాటూరు రవీంద్రత్రివిక్రమ్

'సృష్టిలో తీయనిది స్నేహమే!'

హితం కోరేవాడు స్నేహితుడు. మనపురాణాల్లో ఆదర్శస్నేహాన్ని నిర్వచించే కథలు ఎన్నో ఉన్నాయి. బాంధవ్యంకన్న స్నేహబంధమే గొప్పది. వాలి-సుగ్రీవులు సోదరులే కానీ, అపార్థాలవల్ల పరమశత్రువులయ్యారు. సుగ్రీవుడితో స్నేహం చేసిన రాముడు, అతనికి పీడగా పరిణమించిన వాలిని ఒకే ఒక్కబాణంతో వధించాడు. తద్వారా, మిత్రుడికష్టాన్ని తొలగించి, వానరసామ్రాజ్యానికి మహారాజును చేశాడు. అలాగే విభీషణుణ్ణికూడా స్నేహితుడిగా స్వీకరించి, రావణవధకు ముందుగానే లంకాసామ్రాజ్యాన్ని అభిషేకించాడు. కుచేలుడిగా ప్రసిద్ధికెక్కిన సుదాముడిపట్ల కృష్ణుడిస్నేహప్రేమ 'న భూతో న భవిష్యతిగా చెప్పదగింది.

సాందీపమహామునివద్ద శ్రీకృష్ణ - సుదాములు సహవిద్యార్థులు. ఎప్పుడూ జంటగా తిరిగేవాళ్లు. కలిసి ఆటపాటలు సాగించేవాళ్లు, బాల్యదశలో సుదాముడికి శ్రీకృష్ణుడు అవతారమూర్తి అనీ, సాక్షాత్తు పరమాత్మ అనీ తెలియదు. ఒకనాడు గురుపత్ని ఇద్దరికోసమూ ఇచ్చినకారపుశనగల్ని బాల్యచాపల్యంవల్ల చాటుగా తానొక్కడే తినేశాడు. పక్కనే పరమాత్మ ఉన్నా పలుకుకూడా పెట్ట కుండా, అన్నీ తానే ఆరగించినదోషానికి, గృహస్థజీవితంలో అధికభాగం నికృష్టమైనదారిద్ర్యబాధలు అనుభవించాల్సి వచ్చింది.

బుద్ధివికసించిన తర్వాత, శ్రీకృష్ణుడిదివ్యలీలలగురించి ఆనోటా ఆనోటా వింటున్నకొద్దీ, తన బాల్యమిత్రుడు సాక్షాత్తు పరమాత్మే సుమా! - అన్న సత్యం అవగతమైంది. ఆయనను త్రికరణశుద్ధిగా ఆరాధించి, పూజిస్తూ వచ్చాడు. కర్మానుభవం తీరగానే, భార్యప్రేరణతో ద్వారకానగరానికి పయనమయ్యాడు. అతికష్టంమీద అంతఃపురప్రవేశం లభించింది. ఆ పరమాత్మ- దేవతలుసైతం ఆశ్చర్యపడేలా, యుగయుగాల్లో అందరూ చెప్పుకునేంతఘనంగా తనస్నేహ ధర్మాన్ని నిర్వర్తించాడు. అష్టభార్యలసమేతంగా అతిథిపూజ చేశాడు. రెండు గుప్పెళ్ల అటుకులు స్వీకరించి, అష్టైశ్వర్యాలను అనుగ్రహించాడు.



శ్రీకృష్ణుడు తన స్నేహితుడైన అర్జునుడికోసం ఎన్నెన్నో అద్భుతకార్యాలు చేశాడు. అనితరసాధ్యమైన అస్త్రసంపత్తిని చేకూర్చిపెట్టాడు. పరమేశ్వరాను గ్రహంతో పాశుపతాస్త్రాన్ని పొందటానికి ప్రోత్సహించాడు. దేవతలకు దుస్సాధ్య మైన నిజవైకుంఠదర్శనం చేయించడమే గాక, అక్కడ విలసితుడైన మూలవిరాట్టు శ్రీమహావిష్ణువు ఆశీస్సులతో, అనుగ్రహభాషణం చేయించాడు. అన్నింటికన్నా ఘన మైన 'విశ్వరూప' సందర్శనభాగ్యం కలిగించాడు. భగవద్గీత బోధించాడు.

శ్రీకృష్ణార్జునస్నేహంతో పోల్చదగింది ఏ యుగంలోనూ లేదన్నది అక్షర సత్యం అయితే ఇన్నిదివ్యగాథలు చదవటం, వినటంద్వారా మనం ఏమైనా నేర్చుకున్నామా? ఆచరణలో మనం స్నేహధర్మాన్ని సరిగా నిర్వర్తిస్తున్నామా?

ఇవి ఎవరికివారు వేసుకోవలసినప్రశ్నలు.

ఒకరితో స్నేహంచేసే ముందు అన్నివిధాల మనఅభిరుచులకు తగినవ్యక్తినీ, సహృదయం కలవారినీ, స్నేహానికి తప్ప స్వార్థానికి ప్రాధాన్యం ఇవ్వనివారినీ, పరిపరివిధాలు పరీక్షించి, ఎంచుకోవటం మంచిది.

మంచిస్నేహం పొందాలంటే, ముందు మనం మంచిస్నేహభావాలు కలిగి ఉండాలి. ప్రాపంచికస్నేహాలకన్న ఆధ్యాత్మిక సంబంధమైన స్నేహాలు కలకాలం వర్ధిల్లుతాయి. వారు ఆధ్యాత్మికప్రగతికి ఒకరినొకరు ప్రోత్సహించుకుంటుంటారు. అంతకన్న స్నేహ ప్రయోజనం మరొకటిలేదు.



పగ ఉంటే నిద్రపట్టదు

# చేతవెన్నముద్ద!



– శ్రీమతి పురాణపండ వైజయంతి

ఆగష్టు 15న
**గోకులాష్టమి**
సందర్భంగా..

శ్రీకృష్ణుడు అనగానే చేతిలో వెన్నముద్దే గుర్తుకొస్తుంది. శ్రీకృష్ణపరమాత్ముడు జన్మించిన అష్టమితిథి శ్రీకృష్ణజన్మాష్టమిగా ప్రసిద్ధి. నల్లనివానిజన్మదినాన్ని దేశవ్యాప్తంగా ఎంతోసంతోషంగా భక్తిశ్రద్ధలతో జరుపుకుంటారు. కొన్నిప్రాంతాలవారు ఆ రోజంతా ఉపవాసం ఉంటారు. కొన్నిప్రాంతాలవారు శ్రీకృష్ణునికీర్తనలు గానం చేస్తూ, కోలాటం ఆడుతారు. చాలాప్రాంతాల్లో ఉట్టి కొడతారు. కొన్నిప్రదేశాల్లో శ్రీకృష్ణునికి ప్రీతిపాత్రమైన మధురపదార్థాలను తయారుచేసి నివేదన చేస్తారు.

శ్రీకృష్ణుడికి మధురపదార్థాలంటే మిక్కిలి మక్కువ ఆయన సాక్షాత్తు మధురా నగరవాసి. నగరంలోనూ తీయదనమే ఉంది.

బాలగోపాలునిబాల్యచేష్టలు వర్ణించతరమా? గోకులంలో గోపికల ఇళ్లకు రహస్యంగా వెళ్లి పాలు, పెరుగు, వెన్నమీగడలతో పాటు మిఠాయిలకోసం గాలించేవాడు. "వీడటే! మందలో వెన్నలు దొంగిలి దర్పించి మెక్కిన దాపరీడు." అని పోతన ఆయనను కీర్తించాడు. అలావారిఇళ్లకు వచ్చి, దొంగతనంగా తింటుంటే ఆ ఇళ్లవారు ఆనందించేవారట. అందుకోసమనే ప్రత్యేకంగా స్వచ్ఛమైనఆవునేతితో మిఠాయిలు తయారుచేసి, ఉట్టి మీద ఉంచేవారని కృష్ణభక్తులు కథలు కథలుగా చెప్పుకుంటారు. శ్రీకృష్ణభక్తులు పాలతో తయారు చేసినమిఠాయిలు మధురాధిపతికి నివేదన చేస్తారు.

శ్రీకృష్ణజన్మాష్టమినాడుమాత్రం కొన్నిరకాల మధురపదార్థాలు మాత్రమే తయారుచేసి, ఆయనను పూజించి, నివేదనచేస్తారు. రబ్రీ, ఖీర్ పాలకోవా, గోపాల్‌కాలా, మిస్టీ దోయ్, కలాకండ్....... వంటివి ఆ చిన్ని కృష్ణుడు ఇష్టంగా తింటాడని భక్తుల విశ్వాసం. ఇవి కాకుండా ఆయాప్రాంతాల ఆచారాలను అనుసరించి రకరకాలమిఠాయిలనుకూడా తయారుచేసి, నివేదన చేస్తారు.

కొబ్బరితురుము, చిక్కటిపాలమీగడ, పంచదారలతో తయారుచేసే పాలలడ్డును ఉపవాసం ఉన్నవారు సాయంత్రం భగవంతుడికి నివేదన చేసి తింటారు. కేసరి, కోవా, హల్వా, సేమ్యా...... అబ్బో ఎన్నిరకాలో, ముఖ్యంగా మహారాష్ట్రవాసులు తయారుచేసే బాసుంది ఈ పండుగకు ప్రత్యేకం. బియ్యాన్ని నీళ్లలో నానబెట్టి, రవ్వ తయారుచేసి, పాలలో ఉడకబెట్టి, డ్రైఫ్రూట్స్ వేసుకుని చల్లనయ్యకు అర్పించి, ఆ నల్లనివానికి ఇష్టమైన చల్లటి వంటకాన్ని ప్రసాదంగా సేవిస్తారు.

ఉత్తరాదివారు ఎక్కువగా తయారుచేసే బాదం ఫిర్నీ..... వాస్తవానికి కశ్మీరదేశం నుంచి వచ్చింది. బియ్యం పిండికి, బెల్లం జతచేసి, బాదంపప్పులు

**పిల్లలందరూ చల్దులు తిని, ఆటలకు పోగా - యశోదాదేవి పెరుగు చిలుకుతూ, వెన్న తీస్తున్నది. ఆ సమయానికి కృష్ణుడు వచ్చి, రెండుకాళ్లూ చుట్టుకుని పైటలాగుతూ-**

**అమ్మా..! పాలు. ఆకలి, పాలియ్యవే..!! అని ఆగడం చేసి, తన చేతుల్లోకి కవ్వం అందుకోగా, చేసేది లేక ఆ తల్లి, బిడ్డను ఒడిలోకి తీసుకుని పాలిచ్చింది. ఈలోగా దాలి పొయ్యిలో పాలు పొంగడం చూసి దింపడానికి వెళ్లింది.**

**ఆ సందుచూసి ఉట్టి మీద కుండకు చిల్లు పెట్టి, వెన్న తినడం మొదలుపెట్టాడు కృష్ణుడు.**

వేసి ఆ బాలగోపాలు నికి నివేదిస్తారు. గులాబీఖీర్‌ను కేవలం అరగంటలో తయారు చేసి ఆకలివేస్తున్న కిట్టయ్యకు తినిపిస్తారు.

బోలెడన్ని పాలు, వెన్న వేసి తయారుచేస్తే ఈ వంటకాన్ని బాలగోపాలుడు తినకుండా ఉండగలడా? బెంగాలీలు శిఖిపింఛమౌళికి రంగురంగుల మలై చమ్ చమ్ ప్రేమగా సమర్పిస్తారు. మరింత రుచికోసం కుంకుమపువ్వు, మీగడ బాగా దట్టిస్తారు.

బాలగోపాలుడు... జగద్గురువు జగత్తులో జన్మించిన శుభదినం. ఈ రోజు తెల్లవారుజామునుంచి అర్ధరాత్రివరకు ఉపవాసదీక్ష కొనసాగుతుంది. అర్ధరాత్రి పన్నెండుగంటలకు చందమామను దర్శించి, ఉపవాసదీక్ష విరమిస్తారు. విరమణ సమయంలో శ్రీకృష్ణుడిని ఆహ్వానిస్తూ పూజ ఆచరించి, నైవేద్యాలు సమర్పిస్తారు. ఇక్కడొక చిన్నసవరణ ఉంది. ఉపవాససమయంలో పండ్లు, పాలు తీసుకోవచ్చు. అలాగే దీక్ష విరమించాక సగుజావ, శ్రీఖండ్, అటుకులు, ఇడ్లీ, సెనగలు తిన వచ్చునని శాస్త్రం. ఉల్లి, వెల్లుల్లి, బియ్యం పూర్తిగా నిషేధం.

ఈ పండుగను ఒంటరిగా కాకుండా సామూహికంగా జరుపుకోవాలి. కొందరు దేవాలయాలకు వెళ్లి, భజనలు చేస్తూ భక్తితో అర్చిస్తారు. ఇంటిదగ్గరే పండుగ చేసుకోవాలనుకునేవారు శ్రీకృష్ణుడిని భక్తిపూర్వకంగా ఆయాగృహాలకు ఆహ్వానించాలి. ఇందుకు ముఖ్యంగా రెండుమార్గాలు అవలంబిస్తే బాలగోపాలుడు సంబరపడతాడట. ఆయనకు మిఠాయిలంటే ఇష్టమని తెలిసిందే కదా. పూజగదిని అందంగా అలంకరించి, ఆ వెన్నదొంగను కన్నబిడ్డలా భావించి వెన్నతో ఆహ్వానిస్తే పరమానందపడతాడట.

జన్మాష్టమినాడు ముఖ్యంగా అన్ని ప్రాంతాలవారు కాయం తయారుచేస్తారు. మిగిలిన మిఠాయిలు నివేదన చేసినా, చేయకున్నా ఇది మాత్రం తప్పనిసరి.

| | |
|---|---|
| శొంఠిపొడి | - టీ స్పూను (శొంఠిని నేతిలో వేయించి పొడి చేయాలి) |
| బెల్లం పొడి | - 8 టేబుల్ స్పూన్లు |
| మిరియాల పొడి | - అర టీ స్పూను |
| వాము | - అర టీ స్పూను |
| ధనియాల పొడి | - అర టీ స్పూను |
| కరిగించిన ఆవు నెయ్యి | - పావు కప్పు |

అన్ని పదార్థాలను ఒక పెద్దపాత్రలో వేసి బాగా కలపాలి. చివరగా నెయ్యివేస్తూ ఉండలు చేయాలి. బుల్లి కృష్ణుడికి నివేదని చేసి ప్రసాదంగా తినాలి. అతిగా తిన కూడదు.

అన్నమయ్య తనకీర్తనలలో చిన్నికృష్ణున్ని వెన్నదొంగగా కీర్తించాడు.



చిన్నిశిశువు చిన్నిశిశువు
ఎన్నడూ చూడమమ్మ ఇటువంటిశిశువు

బలుపైన పొట్టమీద పాలచారలతోడ
నులివేడి వెన్న తిన్ననోరితోడ.....

నవనీతచోరా నమో నమో

పాలదొంగవద్ద వచ్చిపాడేరు
తమపాలిటి దైవమని బ్రహ్మాదులు......

## చిన్ని చిన్ని కన్నయ్యా.....

శ్రీకృష్ణుడు సర్వాంతర్యామి, సర్వులకూ ఆనందం కలిగించే సుందరవదనుడు. అందుకే శ్రీకృష్ణాష్టమి వచ్చిందంటే చాలు ఆనల్లనివాడు పసిపాపలున్న ప్రతి ఇంటిలోనూ ప్రవేశిస్తాడు. ఇంటింటా బుల్లికృష్ణుల రూపంలో కనువిందుచేస్తాడు. ప్రతితల్లీ యశోదమ్మలా



మారిపోతుంది. పిల్లల్ని దండిస్తుంది, అంతలోనే గారం చేస్తుంది. బాల్యంలో పసిపిల్లలు చేసే అల్లరిచేష్టలు కృష్ణుడిని గుర్తుచేస్తాయి. ప్రతిపాఠశాలలోనూ శ్రీకృష్ణాష్టమిసందర్భంగా శ్రీకృష్ణుడు వేషంలో పిల్లలకు పోటీలు పెడతారు. పిల్లలంతా కృష్ణుడి జడవేసుకుని, తలలో నెమలికన్ను, చేతిలో వేణువు, మెడలో చెంగల్వ పూల హారం, కాళ్లకు కడియాలు, పట్టు పంచెకట్టుకుని బుడి బుడి అడుగులు వేస్తూ శ్రీకృష్ణుడిలా వ్యత్యస్తపాదాలతో అందరినీ అలరిస్తారు. ఇటువంటి వేషధారణ కేవలం శ్రీకృష్ణాష్టమి ప్రత్యేకం.






సుబ్రహ్మణ్యేశ్వరుడిని ఆరాధించడానికి అతి పవిత్రమైన రోజు ఆడికృత్తిక, దక్షిణాయన పుణ్య కాలంలో తొలిరోజు ఆడికృత్తిక. సూర్యుడు తన గమనాన్ని ఉత్తరదిశనుంచి దక్షిణదిశకు మార్చు కున్న రోజు. సుబ్రహ్మణ్యేశ్వరస్వామిజన్మనక్షత్రం కృత్తిక కావడంతో ఆడికృత్తికకు అత్యంతప్రాధాన్యత ఉంది. ప్రపంచవ్యాప్తంగా సుబ్రహ్మణ్యునిఆలయాల్లో ఆడికృత్తికనాడు విశేషపూజలు జరుగుతాయి. ఈ పండుగకు. ఆడికృత్తిక, కృత్తిగై, కృతిక, కృత్తిక అని నామాంతరాలు. సుబ్రహ్మణ్యేశ్వరుడికి మురుగ, కార్తికేయ, షణ్ముఖ... అని పలునామాలు.

### ఎవరు ఈ సుబ్రహ్మణ్యేశ్వరుడు

రాక్షసులను సంహరించడానికే శివపార్వతులకు పుత్రుడుగా జన్మించాడు. యుద్ధానికి అధిపతి మాత్రమే కాదు, దయాకరుణలకు ప్రతీకగా నిలిచాడు-కార్తికేయుడు. చెడును పారద్రోలుతాడు. ఆటంకాలు తొలగిస్తాడు. జ్ఞానవిజ్ఞానాలను, నాయకత్వ లక్షణాలను ప్రసాదిస్తాడు. సదాలోచన, శక్తి, ధైర్యం,

**ఆగష్టు, 15న ఆడికృత్తిక సందర్భంగా...**

ఆత్మవిశ్వాసం కలిగిస్తాడని పండితులు సుబ్రహ్మణ్యేశ్వరుడినిగురించి ప్రస్తుతిస్తారు. ఆరునక్షత్రాలసమాహారం కృత్తిక నక్షత్రం. ఆరుగురు పసిపాపలను రక్షించడానికి ఆరుగురు స్త్రీమూర్తులు భువికి ఏతెంచారని ఐతిహ్యం. అందువల్ల కృత్తికానక్షత్రానికి రెండురకాల ప్రాధాన్యతలు ఉన్నాయి. మొట్టమొదటగా ఇది మురుగజన్మనక్షత్రం. రెండవది - ఆరుగురుకృత్తికమహిళలు మురుగను పెంచడం.

ఈ కథను పరిశీలిస్తే కార్తికేయుడు ఆరుగురు బాలలుగా జన్మించాడని, ఆరుగురుకృత్తికనక్షత్రాలు ఆయనను పెంచి పోషించారని, అటు పిమ్మట పార్వతీదేవి ఈ ఆరుగురిని ఏకశరీరంగా, ఆరుతలలుగా చేసిందని తెలుస్తోంది. ప్రతి కృత్తిక నక్షత్రంనాడు కార్తికేయుడికి ప్రత్యేకపూజలు నిర్వర్తిస్తుంటారు. ఆరు శిరస్సులు ఉండటంతో, ఆయన శక్తి, న్యాయం, ఆరోగ్యం, విజయం, బంధాలు, ఆస్తి విషయాలలో సహకరిస్తాడని పెద్దలు చెబుతారు.

ఆదికృత్తిక పరమపవిత్రమైనరోజు. స్కాందపురాణంలో సుబ్రహ్మణ్యేశ్వరునికి సంబంధించిన అనేకగాథలు ఉన్నాయి. శివునిమూడోనేత్రం నుంచి నిప్పులు వెదజల్లుతూ మురుగన్ ఉద్భవించాడు. ఆ అగ్నిప్రభావం అత్యంత అధికంగా ఉండటంతో, దక్షిణదిక్కుగా ఉన్న వింధ్యపర్వతప్రాంతానికి తీసుకువెళ్లమని అగ్నిదేవుడు కోరాడట. సాక్షాత్తు అగ్నిదేవుడే ఆ అగ్నిబాధ తాళలేకపోయాడు. అగ్నికీలను నీటిలో విడిచిపెట్టాడు. అదే ఆ తర్వాత శరవణపోయిగైగా బయటకు వచ్చింది. ఈ అగ్నికీల చల్లగా ఉన్న నీటి ఉపరితలాన్ని తాకగానే అది ఆరుకీలలుగా విడిపోయి, ఒక్కో కీల అందమైన బాలుడిరూపం ధరించింది. ఆ సమయంలో శివపార్వతులు అక్కడ ప్రత్యక్షమై కృత్తికనక్షత్రాన్ని సృజియించారని ఒక కథ వాడుకలో ఉంది....

**'శరవణభవ' శబ్దానికి అర్థం....**

- శ - ఇతరులను ఆకర్షించే లక్షణం
- ర - సంపదలను అనుభవించే యోగం
- వ - శారీరక అనారోగ్యాలు, అప్పుల నుంచి విముక్తి
- ణ - సమస్యలను, శత్రువులను తొలగించడం
- భ - జీవితంలో ఆనందం
- వ - దుష్టశక్తులను నాశనం చేయడం.

ఖగోళశాస్త్రం ప్రకారం కృత్తిక ఆరు నక్షత్రాల సమాహారం. వాటికి మండే లక్షణం ఉంది. ఆదికృత్తిక నాడు అంగారకుడు మిథునరాశిలోకి ప్రవేశిస్తాడు. అంగారకుడికి అధిపతియైన శ్రీసుబ్రహ్మణ్యేశ్వరుని అర్చిస్తే, ఆయన దుష్టశక్తులను పారద్రోలి, విజయాలు సాధించేందుకు దోహద పడతాడు. ఆడికృత్తిక.... తల్లీబిడ్డల మధ్య పవిత్ర అనుబంధానికి శుభసూచకం. 'మురుగ' అనేపదానికి తమిళంలో 'అందమైన' అని అర్థం. ఆడికృత్తికనాడు సుబ్రహ్మణ్యేశ్వరునిఆలయాలలో పూజలు, అభిషేకాలు, యజ్ఞాలు నిర్వర్తిస్తారు. వందలకొద్దీభక్తులు ఆయనకు కావళ్లు అర్పిస్తారు. భక్తులకు దేవతలు వరాలనిచ్చే మాసం ఆడికృత్తిక.



# భామనే... సత్యభామనే..!!

- డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య

ఆంధ్రప్రజానీకాన్ని 'వరూధిని' మీకు తెలుసా? అని అడిగితే చదువుకొన్నవాళ్లలో కొద్దిమందిమాత్రమే మాకు తెలుసు అని అంటారేమో! ఆమె చిరునామా చెప్పండని అడిగితే చాలామంది చెప్పలేరేమో!

ఆలాగే, 'గిరిక' మీకు తెలుసా? అంటే అందరు మాకు తెలీదనే అంటారు. కొందరు పల్లెటూరివాళ్లైతే గరిక మాకు తెలుసు గాని, గిరిక మాకు తెలీదనే అంటారు.

నిగమశర్మఅక్కగారిని మీరు చూచారా? అంటే, ఆమె పేరేమిటో చెప్పండని అడుగుతారు. ఆమెపేరు మనకు తెలిస్తే కదా వాళ్లకు చెప్పటానికి.

అదే సత్యభామనుగూర్చి అడిగాం అనుకోండి– అందరు 'ఆమె మనమనిషే కదండీ' అంటారు. ఆమె మీకు తెలిసినట్లు గుర్తేమిటి? అంటే, సత్యభామ జడనుగూర్చి చాలా చెపుతారు. ఆంధ్రప్రదేశంలో ఆమెతో పాటు ఆమె జడకూడ అంతప్రచారం పొందింది. అంతేకాదు. ఆమె అలుక కూడ అమితప్రచారం పొందింది. అంతేకాదు. ఆమె అలిగి శ్రీకృష్ణుని శిరస్సును కాలితో ఆవలికి త్రోసిన వైనం కూడ విశేషప్రచారం పొందింది. అంతేకాదు. అంతటి శ్రీకృష్ణభగవానుణ్ణి ఆమె తక్కెట్లో కూర్చోబెట్టి తూకం వేసిన ఉదంతంకూడా ఊరూరా ప్రచారం పొందింది.

తెలుగుసాహిత్యంలో మనుచరిత్ర, ఆముక్తమాల్యద, వసు చరిత్ర, కళాపూర్ణోదయం, పాండురంగమాహాత్మ్యం మొదలైన ప్రబంధాలు ప్రసిద్ధిపొందినా, ఆ ప్రబంధాల్లోని స్త్రీమూర్తులు మాత్రం ఆంధ్రప్రజానీకానికి అట్టే పరిచయం కాలేదు.

ఏ ముహూర్తాన ముక్కు తిమ్మనగారు పారిజాతాపహరణ ప్రబంధం వ్రాశారో గాని, ఏ ముహూర్తాన కూచిపూడి భాగవతులు భామాకలాపం మొదలు పెట్టారోగాని, ఏ ముహూర్తాన ప్రతిభా వంతులైన తెలుగురంగస్థలనటులు శ్రీకృష్ణతులాభారనాటకాన్ని ఎన్నెన్నిసార్లు, ఎక్కడెక్కడ, ఎప్పుడెప్పుడు ప్రదర్శించి ప్రేక్షకుల పరవశింపజేశారో గాని, ఎందరెందరో పౌరాణికులు, హరికథకులు, జానపద కళాకారులు సత్యభామాశ్రీకృష్ణుల కథను తెలుగుశ్రోత లకు రసవత్తరంగా వినిపించారోగాని – ఎక్కడోపుట్టి, ఎంతోగొప్పగా పెరిగి, అవతారపురుషుడైన ఆ శ్రీకృష్ణుని చేపట్టిన సత్యభామ తెలుగు వారికి ఎంతో ఆత్మీయురాలైంది. తెలుగువారి సత్యభామ అయింది. ఆమెజడ తెలుగు ఆడపడుచుల సొంతమైంది.

అందం ఆనందహేతువు. అంతేకాదు. ఆడువారి విషయంలో అది స్వాతిశయహేతువు కూడ. అందంతో పాటు పుట్టింటి గొప్పతనం, యౌవనవైభవం, భర్త అనురాగం, ఆయన ఐశ్వర్యం పుష్కలంగా ఉంటే – ఆ స్త్రీ మూర్తి స్వాతిశయానికి హద్దు లుంటాయా! తక్కిన స్త్రీలంతా తనకంటే తక్కువన్న భావన, అందరు తన్నుగూర్చి గొప్పగా చెప్పుకోవాలన్న కోరిక ఆమె గుండెలోతుల్లో గూళ్ళు కట్టుకోవా!

సత్యభామ అందాలరాశి. సత్రాజిత్ మహారాజు కూతురు– సాత్రాజితి. రోజుకు ఎనిమిదిబారువుల బంగారాన్నిచ్చే శమంతక మణిని కట్నంగా తెచ్చిన కాంతామణి. యౌవనం పొంగిపొరలే యువతి. భర్త అనురాగం పుష్కలంగా ఉన్న శ్రీమతి. అన్నింటిని మించి అవతారపురుషుడిని అందరు ఆరాధించే శ్రీకృష్ణునిముద్దుల సతి. ఇక ఆమె నిక్కినడిచిందంటే నడువదా! విర్రవీగిందంటే విర్రవీ గదా! అందుకే తిమ్మనగారు 'చక్కని దాననంచుఁ, బతి యెంతయు నా కనురక్తుఁ డంచుఁ, దా నిక్కుచు విర్రవీగుచు గణింపదు కాంతల సత్య'' అని, ఆ త్రిలోకసంచారి నారదునిచేత చెప్పించాడు.

రుక్మిణీదేవికికూడా సత్యకున్న విశేషాలన్నీ ఉన్నాయి. అంతేకాదు. ఆమె లక్ష్మీదేవి అంశకూడా. అంతేకాదు. ఆమె శ్రీకృష్ణునిపెద్దభార్య. అయినా, ఆమెకు ఈ నిక్కుడు లేదు. ఈ విర్ర వీగుడు లేదు. ఆమె సౌమ్యగంభీరస్త్రీమూర్తి. నిండుకొలనులాంటిది. సత్య గలగలపారే సెలయేరు; కొండమీదినుండి క్రిందికి దూకే జలపాతం.

ముల్లోకాల్లో ఎవ్వరైనా సరే సత్యవలె ఇంత నిక్కుతుంటే, ఇంత విర్రవీగుతుంటే కలహభోజనుడైన నారదుడు సహించగలడా? ఆయనకు కడుపుబ్బదూ! నిద్రపట్టుతుందా!

అందుకే నారదమహర్షి సత్యగర్వాన్ని తగ్గించాలనుకొన్నా డేమో! లేకుంటే శ్రీకృష్ణుడు రుక్మిణీకాంతగృహంలో పాచికలాడుతూ వినోదిస్తూన్న సమయంలో ఆయనను దర్శించటానికి అక్కడికి రావాలా? ఆయనను దర్శించటానికి అంతకంటె మంచి సమయం ఆ మహర్షికి దొరకదా? కాని, వచ్చినవాడు ఊరకే వచ్చాడా! మహాత్ముల దర్శించటానికి వెళ్ళేటప్పుడు.... వట్టిచేతులతో వెళ్ల కూడదన్నట్లు.... – ఒక పువ్వు చేత పట్టుకొని....... వచ్చాడు.

అది సామాన్యమైన పువ్వా! కాదే. దేవలోకపారిజాత పుష్పం. పోనీ, తెచ్చేవాడు రెండుపూలు తేకూడదూ? ఏ సమస్యా ఉండేది కాదు. ఒక్క పువ్వే తెచ్చాడు. కావాలనే ఆ కలహభోజనుడు అలా తెచ్చాడెమో! తెచ్చి, అది శ్రీకృష్ణుని చేతికిచ్చాడు. ఆ సత్యాపతికి పెద్దసమస్యే తెచ్చిపెట్టాడు. పాపం....! శ్రీకృష్ణుడు ప్రక్కనే ఉన్నరుక్మిణీదేవి కివ్వాలా? లేక ఎక్కడో ఉన్న ముద్దులభార్య సత్యభామకివ్వాలా? ఇదీ ఆయన సమస్య- ఎంత పెద్దసమస్య! ఈ తంటాల మారి మహర్షి ఎంత చిక్కు తెచ్చిపెట్టాడని! శ్రీకృష్ణుడు ఎటూతేల్చుకోలేక తనలో తాను సతమతమౌతుంటే- ఆయన ఆ పువ్వు ఎవరికిచ్చుకొంటే నాకెందుకు లెమ్మని ఈ నారదమహర్షి ఊరకున్నాడా! లేదే! రుక్మిణీదేవి కిమ్మని సంజ్ఞ చేశాడు.

శ్రీకృష్ణుడు ఇప్పటికిదే ఉచితమనుకొన్నాడు. ఆ పూవును తానే స్వయంగా రుక్మిణీదేవిసిగలో అలంకరించాడు. పువ్వును ధరించగానే ఆమెశోభ అంతకంత పెరిగింది. ఆమె ఎంతో మురిసి పోయింది. అందరు ఆనందించారు.

అంతతోనైనా నారదుడు ఊరకున్నాడా? లేదే. ఆ దివ్యపుష్పమహిమను గొప్పగా కొనియాడాడు. పోనీ అంతటితోనైనా ఆగాడా? ఆగలేదే! రుక్మిణితో 'సవతులందరిలో ఎన్న సరిలేరు నీకు' అన్నాడు. 'సవతులంతా ఇక నీ పాదసేవ చేస్తా' రన్నాడు. 'ఇంతకాలము కృష్ణుడు సత్యావిధేయుడని విన్నాము. ఈ రోజు ఆయన ఈ పువ్వు నీకిచ్చాడు కనుక, ఆయనకు నీ మీదే మక్కువ ఎక్కు'వని అన్నాడు.

ఇవి సామాన్యమైనమాటలా! సత్యభామమనస్సులో చిచ్చురగిల్చే మాటలు కదా! పాపం! శ్రీకృష్ణుడు ఏమనగలడు? అన్నీ విన్నాడు. అంతా చూచాడు. నిస్సహాయంగా ఊరకున్నాడు.

మొత్తానికి నారదుడు నిప్పు రగిల్చి, ఆయన దారిన ఆయన వెళ్ళాడు. నారాయణ నారాయణ అనుకుంటూ, చిరుతలు మ్రోగించు కొంటూవెళ్లాడు. అక్కడే ఉన్న సత్యభామ చెలికత్తె ఆ నిప్పుకుప్పనంతా అట్టె తీసుకువెళ్లి సత్య చెవిన వేసింది.

ఇక సత్య సంగతి చెప్పాలా? దెబ్బతిన్న త్రాచులా, నేయి వోయ భగ్గని పై కెగసిన అగ్నిజ్వాలలా పైకి లేచిందట. ఆ లేవటంలోనే ఎంత తీవ్రత! ఎంత కోపం! ఎంత తీక్షత!

చిత్రమేమంటే-సత్యకు సవతులుగా పదహారువేల మంది గోపికలున్నారు. రుక్మిణి, జాంబవతి, కాళింది వంటి ఏడుగురు అంతఃపురరాణులున్నారు. వీళ్లలో పదహారువేల ఆరుగురిసంగతి తనకక్కరలేదు. వాళ్లవిషయంలో 'సరిలేరు నాకెవ్వరు' అన్నదే సత్యభావన. ఒక్క రుక్మిణీదేవితోనే ఆమె పోటీ-ఆమె రుసరుస-ఆమె రవరవ.

ఆలాంటి రుక్మిణీదేవి అంతఃపురంలో ఇంత జరగటమా? నారదుడిచ్చిన పారిజాతాన్ని కృష్ణుడు భద్రంగా దాచి తనకు తెచ్చి ఇవ్వకుండా, తన సవతి రుక్మిణి కివ్వటమా? అందులోను స్వయంగా ఆమెకొప్పులో అలంకరించటమా? ఆ తంటాల మారి నారదుడు తన్నుగూర్చి అందరిముందు అన్ని మాటలనటమా? ఈ ధూర్తగోపాలుడు అన్నీ వింటూ ఊరకుండటమా? ఇది తనకెంత తిరస్కారం! ఎంత అవమానం!

దీన్ని భరించటం ఏలాగ? ఇంక ముందు తలయెత్తుకొని నలుగురిలో తిరగటం ఎలాగ? అందుకే సత్య అంతకోపంతో, అంత ఆవేదనతో అలా పైకి లేచింది. ఆడుత్రాచు మంచిగంధంచెట్టు తొర్రలోకి సరసర ప్రాకి వెళ్లినట్లు కోప గృహంలోకి ఒక్క ఊపున వెళ్ళింది. కట్టుకున్న పట్టుచీరను విప్పి ఆవల పారే సింది. వెదికి వెదికి ఒక పాతచీరను చుట్టుకుంది. ఒంటిమీది నగలన్నీ తీసివేసింది. తలచుట్టూ వాసెన కట్టు కట్టు కొంది. ఆ చీకటింట, కుక్కి మంచం మీద, ఓ మూల ముడుకొని పడుకుంది. అటూ ఇటూ పొరలుతూ ఉంది. తిమ్మనగారు "జలదాంతచంద్రరేఖాసదృ శాంగియై పొరలె" అని అద్భుతమైన ఒక అలం కారంతో వంకర తిరిగి పడుకొన్న ఆమె పడక భంగిమను- పాఠకుల కళ్లకు కట్టాడు.



(ఇంకా ఉంది)





# కొండలలో కొలువైన... కోటిజ్ఞానకాంతులస్వామి




– శ్రీమతి డి.పూర్ణిమాస్వాతి

***శివపార్వతుల గారాల తనయుడు, దేవసేనాధిపతి, తారకాసురసంహారానికి ఉద్భవించిన కారణజన్ముడు కార్తికేయుడు. సకల విద్యా పారంగతుడిగా, జ్ఞానప్రదాతగా, దండాయుధపాణిగా, సుబ్రహ్మణ్యేశ్వరునికి పేరు. సుబ్రహ్మణ్యేశ్వరుని ఆలయాలకు, ఆయనను అర్చించే భక్తులకు తెలుగునాట కొదవలేనప్పటికీ తమిళనాడు, కర్ణాటకలలో మనకన్నా అధికంగా సుబ్రహ్మణ్యేశ్వరునికి అడుగడుగునా గుడులు కట్టి పూజించడం సర్వసాధారణంగా కనబడుతుంటుంది. తమిళనాట గల ప్రసిద్ధి చెందిన సుబ్రహ్మణ్యక్షేత్రం 'పళని'. దండాయుధపాణిగా, బాల మురుగన్‌గా, పళని మురుగా అని తమిళులు కొలిచే ఈ స్వామిఆలయం ఎంతో ప్రముఖమైంది, మహిమాన్వితమైంది.***

## స్థలపురాణం

వినాయకచవితినాడు మనందరం చెప్పుకునే కథ ఒకటి ఉంది. అదేమంటే గణాధిపత్యంకోసం పోటీపడుతున్న కుమారులలో భూమండలంలోని అన్నిపుణ్యతీర్థాల్లోనూ స్నానం చేసి, ఎవరు ముందుగా తమవద్దకు వస్తారో, వారికే గణాధిపత్య మిస్తానని శివుడు చెప్పడం, ఆ మాట వినడంతోటే తన మయూరవాహనాన్ని అధిరోహించి, కుమారస్వామి వాయువేగంతో వెళ్లిపోవడం, వినాయకుడు తెలివితేటలను ఉపయోగించి, నారాయణమంత్రాన్ని పఠిస్తూ....., మూడుమార్లు తన తల్లిదండ్రులైన శివపార్వతుల చుట్టూ ప్రదక్షిణం చేయడం, ఆ ప్రదక్షిణమహిమతో కుమారస్వామి ఏ పుణ్య తీర్థానికేగినా అన్నగారే తనకన్నాముందుగా వచ్చి పుణ్యతీర్థాలలో స్నానంచేసి వెళ్లిన ఆనవాళ్లు కనిపించి ఖిన్నుడై, కైలాసం వచ్చేసరికి, ఈ పరీక్షలో గణేశుడే నెగ్గాడంటూ గణాధిపత్యాన్ని వినాయకుడికే కట్టబెట్టడం. ఆ ఆనందోత్సాహాలతో వినాయకచవితిపండుగ జరుపుకోవడం. ఇంతవరకూ కథ అందరికీ తెలిసిందే! ఆ తర్వాత ఏం జరిగిందో!!

వినాయకచవితిరోజున తెలుసుకోవడానికి అవకాశం ఉండదు. అది ఇప్పుడు తెలుసుకుందాం. అప్పుడు జరిగిన పరిణామానికి బాలసుబ్రహ్మణ్యేశ్వరుడు ఎంతో బాధపడతాడు. తల్లిదండ్రుల



మీద అలిగి, అన్నగారిలాగా తనకుకూడా పరిపక్వమైన జ్ఞానం లభించాలనే కాంక్షతో తన అలంకారాలన్నింటినీ వదిలేసి, భూలోకం వెళ్లి, అక్కడ తనకు నచ్చిన ఒక కొండమీదగల ప్రశాంతమైన వాతావరణంలో తపస్సులో మునిగిపోయాడు. కైలాసంలో కుమారుని జాడ తెలీక ముద్దుల కుమారుడైన కుమారస్వామికోసం పార్వతీదేవి బెంగపడుతుంది. పరమేశ్వరుడు పార్వతిని ఊరడించి, ఆమెను వెంటబెట్టుకుని కొడుకును వెతుకుతూ భూలోకానికి పయనమౌతాడు. ఇద్దరూ కలసి వెతుకుతుండగా, తమిళనాడులోని తిరుఆవినంకుడి అనే ప్రదేశంవద్దకు రాగానే కొండశిఖరం బంగారు కాంతులతో మెరుస్తూ కనపడటంతో తమకుమారుడు అక్కడే ఉన్నాడని తెలుసుకుని, తపోదీక్షలో ఉన్న పుత్రుని చేరదీసి, ముద్దాడుతూ, "నువ్వే నా జ్ఞానఫలానివిరా! నా బంగారుకొండా!!" అంటూ పార్వతీపరమేశ్వరులు కుమారుని అనుగ్రహిస్తారు. తల్లిదండ్రుల ఊరడింపుతో కుమారస్వామి అలకమానతాడు. కానీ, ఆ ప్రదేశం తనకు ఎంతో నచ్చడంతో తన అంశను అక్కడే వదిలి, తల్లిదండ్రులతో తిరిగి కైలాసం చేరతాడు. ఇదీ పళని సుబ్రహ్మణ్యేశ్వరుని పురాగాథ. ఆ ప్రదేశమే ప్రస్తుతం శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని భక్తులు అర్చించే 'పళని' ఆలయం. తమిళనాడులోని దిండిగల్‌జిల్లాలో మధురైకి వందకిలోమీటర్లదూరంలో ఉన్న ఈ కొండ ప్రకృతి రామణీయకతకు పెట్టిందిపేరు.

## అన్ని విగ్రహాల్లాంటిది కాదు

పళని సుబ్రహ్మణ్యేశ్వర స్వామివిగ్రహం అన్ని విగ్రహాల్లా రాతితో మలిచింది కాదు. నవపాషాణాలతో ప్రత్యేకంగా తీర్చిదిద్దింది. నవపాషాణాలనే తొమ్మిదివిధాలైన మూలికలు అని కొందరంటారు, తొమ్మిది భయంకరమైన విషాలనూ ప్రత్యేకమైనపాళ్లలో కలిపితే అమృతంవంటి ఔషధం తయారౌతుందని, అందుకే దీనిని



భోగార్ అనే ముని ఈ విగ్రహాన్ని ప్రత్యేకశ్రద్ధతో మలిచాడని క్షేత్ర పురాణం. ఈ ఆలయం దాదాపు పదహారుగంటలసేపు తెరిచే ఉంటుంది. అందరూ స్వామిని దర్శనం చేసుకునేందుకు వీలుగా గర్భాలయం తలుపులు ఎల్లప్పుడూ తెరిచే ఉంటాయి. ఈ మందిరం క్రీ.శ.7వ శతాబ్దంలో కేరళరాజు చీమన్‌పెరుమాళ్ కట్టించగా, దాన్ని పాండ్యరాజులు పునరుద్ధరించారు. అద్భుతమైన శిల్పసంపదతో, కేవలం కౌపీనంమాత్రమే కట్టుకుని, చేతిలో శూలాయుధం పట్టుకుని, చూడగానే ఆకట్టుకునే అందమైనవిగ్రహంతో కనువిందు చేస్తాడు ఈ దేవసేనాని, దండాయుధపాణి. కావడిమొక్కులంటే ఇష్టమట ఈస్వామికి, అంటే ఏదైనా ఆపద కలిగినప్పుడు తాము సమర్పించగలిగినదానిని కావిళ్లకొద్దీ సమర్పించుకుంటామని మొక్కుకుని, ఆపదతీరగానే, నియమనిష్ఠలతో స్వామికి కావిళ్లలో మోసుకుంటూ నృత్యగానాలతో స్వయంగా సమర్పించుకుంటారు భక్తులు. తండ్రి అయిన శివునిలాగే ఈయన కూడా అభిషేకప్రియుడు. కార్తిక మాసంలో అయితే రోజుకు కనీసం ఏడువందలమార్లు భక్తుల అభిషేకాలందుకుంటాడు ఈ స్వామి. వల్లీ, దేవసేన ఆయనభార్యలు. ప్రతిసంవత్సరం మార్గశిరశుద్ధషష్ఠి రోజున స్వామివారికి కన్నుల పండువుగా కల్యాణోత్సవం జరుగుతుంది.

### పర్యాటకస్థలాల పళని

పళని చుట్టూ బోలెడన్ని పర్యాటకస్థలాలున్నాయి. తిరునావినంకుడి ఆలయం, ఇదుంబన్ ఆలయం, పదగణపతి ఆలయం, తిరుఅవినాకుడి ఆలయం, పెరియనాయకి అమ్మన్ ఆలయం, పెరియన్ అవుడైయర్ ఆలయం, కన్నడి పెరుమాళ్ ఆలయం, పళనికొండలు, తైపుసి ఆలయం, పార్వతీదేవికి తల్లిగా పేర్కొనే మరియమ్మన్ ఆలయం, మురుగన్ విగ్రహశిల్పి భోగర్ సమాధి ఆలయం, కురుంజి అందవార్ ఆలయం, లక్ష్మీనారాయణ పెరుమాళ్ ఆలయం ముఖ్యమైనవి. అసలు పళనికొండలే ఎంతో ఆహ్లాదకరంగా ఉంటాయి. ప్రకృతిఅందాలను వీక్షిస్తూ పళని ఆలయాన్ని చేరుకోవాలంటే మెట్లమార్గంలో వెళ్లడం ఉత్తమం.

### ఎలా వెళ్లాలంటే..?

పళని సుబ్రహ్మణ్యేశ్వరాలయానికి వెళ్లడం సులువే. రైలు, బస్సు, విమానమార్గాలున్నాయి. దేశంలోని అన్ని ప్రధాననగరాల నుంచి పళనికి నేరుగా బస్సులు, రైళ్లు ఉన్నాయి.

### రైలుమార్గం



పొల్లాచ్చి మీదుగా మధురైనుంచి కోయంబత్తూరు వెళ్లే రైలుంది. అలాగే తిరుచెందూరు నుంచి మధురైమీదుగా పళని వెళ్లేందుకు రైలుంది. చెన్నై సెంట్రల్ నుంచి పళని వెళ్లేందుకు ప్రత్యేకంగా రైలుంది. ఎలాగైనా పళని చేరుకుంటే అక్కడినుంచి కేవలం రెండుకిలోమీటర్ల దూరంలో గల ఆలయాన్ని చేరుకోవడానికి ఆటోరిక్షాలు, బస్సులు విరివిగా ఉన్నాయి.

### వాయుమార్గం



పీలమేడు (లేదా) కోయంబత్తూరు, మధురైవరకు విమానంలో వెళ్తే అక్కడినుంచి పళనికి బస్సులు, రైళ్లు ఉన్నాయి.

### ఎప్పుడు వెళ్లాలి?

వాతావరణపరిస్థితులరీత్యా పళని వెళ్లేందుకు చలికాలమే అనుకూలం. ఎందుకంటే ఎండాకాలంలో విపరీతమైన వేడి ఉంటుంది. వర్షాకాలంలో కొండఎక్కడం కొంచెం కష్టమే. అదే చలికాలంలో అయితే హాయిగా వెళ్లచ్చు. ప్రకృతి అందాలను తనివితీరా తిలకించవచ్చు. పళనిలో ప్రత్యేకమైన కొంగలు బారులు తీరుతాయి. నారాయణపక్షులు, గోల్డెన్ వడ్రంగిపిట్టలు కనువిందు చేస్తాయి. వాటికిలకిలారావాలతో మనస్సుకు ఆహ్లాదం కలిగిస్తాయి. చలికాలంలోనే పళనిలో అనేకఉత్సవాలు జరుగుతాయి. వాటిలో..... కావడి ఉత్సవం, మార్గశిరశుద్ధషష్ఠికి జరిగే కల్యాణోత్సవం ఒకటి. సంతానం లేనివారు, వివాహం కానివారు, కుజదోషం ఉన్నవారు, రాహు, కేతు, కుజగ్రహదోషాలు ఉన్నవారు, కాలసర్పదోషం, నాగదోషం, రాహుకేతుదోషం వగైరాలతో బాధపడేవారు పళని సుబ్రహ్మణ్యేశ్వరుని సందర్శించుకుంటారు. అంతేకాదు, జ్ఞాన ప్రదాతగా పేరుగాంచిన సుబ్రహ్మణ్యేశ్వరుని బుద్ధిమాంద్యంతో బాధపడేవారు కన్నులారా సందర్శించుకుని ఆయా బాధలనుంచి విముక్తి పొందుతుంటారు.







# బాలం ముకుందం మనసా స్మరామి

- డా॥ యల్లాప్రగడ మల్లికార్జునరావు



ధర్మరక్షణకోసం శ్రీమహావిష్ణువు ధరించిన దశావతారాల్లో కృష్ణావతారానికి మరింత విశిష్టత ఉంది. పుట్టిన క్షణంనుంచి వైకుంఠానికి వెళ్లినదాకా ప్రతిసారీ ఆయన తాను దేవుడినని నిరూపిస్తూనే ఉన్నాడు. ఆ స్వామిని భక్తితో కొలుస్తూ అనుసరించినవారు ఆపదలనుంచీ గట్టెక్కారు.

## పుట్టడానికి ముందే...

శ్రీకృష్ణుడంటే దేవుడుకదా, దేవునికి పుట్టుక ఏమిటి అని కొందరికి సందేహం కలుగు తుంటుంది. ఆ సందేహ నివృత్తిని పోతనభాగవతం దశమస్కంధంపూర్వభాగం పద్యాలలో తేటతెల్లం చేశాడు.

దేవకీవసుదేవులు కారాగారంలో బంధితులై ఉన్నారు. దేవకీదేవి నిండుగర్భిణిగా ఉంది. ప్రసవసమయం ఆసన్నమైంది. అప్పుడు ఆమె గర్భంలో శిశువుగా ఉన్న శ్రీమహావిష్ణువును దర్శించటానికి బ్రహ్మాదిదేవతలంతా దేవకీదేవి ఉన్న చెరసాల దగ్గరకే వచ్చి ఆ స్వామిని - "నిత్యత్వం అనే యోగసిద్ధి ప్రాప్తించటానికి నీవే ఆధారం. భూత భవిష్యత్, వర్తమానాలలో ఉండేది నీవే. భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచభూతాలు నీలోనే పుడుతున్నాయి. ఆ అయిదింటిలోనూ నీవే నిండి ఉన్నావు. ఆ పంచభూతాలు ప్రళయకాలంలో అణిగిపోయిన తర్వాత కూడా ఉండేది నీవొక్కడివే. సృష్టిలో ఉన్న సత్యమే నీ వాక్కు. అన్నిటినీ సమానంగా చూడటమనేది నిత్యం నీవు చేసేపని. అటువంటి నీవే దిక్కని నిన్ను మేము ఆశ్రయిస్తున్నాం. మాయ అనేది నీ అధీనంలో ఉంటుంది. ఆ మాయతోనే జ్ఞానం కప్పబడి అజ్ఞానం ఆవరించినవారు నిన్ను తెలుసుకోలేరు. కానీ, జ్ఞానులైన పండితులుమాత్రం ఒకే మనస్సుతో ఆలోచించి, నిన్ను తెలుసుకో గలుగుతున్నారు." అని.

బ్రహ్మాదిదేవతలంతా కీర్తించినవిషయాన్ని గుర్తుతెచ్చుకుంటే ప్రతియుగంలోనూ ఆ స్వామి అవతరించి నప్పుడు ఆయనను చేరి కొలిచినవారు ముక్తులవుతున్నారు.

## శాశ్వతుడు ఆ ఈశ్వరుడే



దేవకి గర్భాన ఉన్నవిష్ణువును దేవతలు స్తుతిస్తూ - "ఓ వాసుదేవా! నీకు పుట్టుక అంటూ వేరేలేదు. మరి అలాంటప్పుడు నీవు ఇలా పుట్టడం అనేది నీకొక ఆట మాత్రమే కానీ అదినిజమైన పుట్టుకకాదు. అదెలాగంటే జనన మరణాదిస్థితులన్నీ మాయ కారణంగా జీవులను ఆవరిస్తూ ఉంటాయి. కానీ, ఆ మాయ నిన్నుమాత్రం తాకలేదు. అందుకే ఆ మాయా మయమైన క్రియలు వేటిలోనూ చిక్కుకోకుండా నీవు ఎప్పటికీ ఉండిపోతావు. అందుకే ఈ జగత్తుకంతటికీ నీవే ఈశ్వరుడవు." అని ఆనాడు కారాగారంలో ఉన్న దేవకి సమీపానికివచ్చి బ్రహ్మాదిదేవతలు ఆ జగన్నాటక సూత్రధారిని కీర్తించినతీరును తెలుసుకోగలిగితే ఆయనపుట్టుట అనేది ఈ జగత్తుకు మార్గదర్శనం చేయిం చేందుకేనని అవగతమౌతోంది.

ఈ లోకేశ్వరేశ్వరుడి కృష్ణావతారతత్త్వాన్ని అందరూ నిరంతరం మననం చేసుకుంటూ ఉండేందుకే శ్రీకృష్ణజన్మాష్టమి ఓ పర్వదినంగా ఆచరణలోకి వచ్చింది.



# ఆరోగ్యానికి వెలుగుచుక్క!

- డా॥ జి.వి.పూర్ణచందు

భూతగణాలసేవలను పొందే గజాననుడు వెలగపండు, నేరేడుపండ్ల సారాన్ని ఇష్టంగా సేవిస్తాడు. గణపతి హోమాల్లో వెలగపండును వేస్తారు. వినాయకచవితినాడు పాలవెల్లికి నాలుగుమూలలా వెలగపండ్లను వ్రేలాడవేసి స్వామిని మనం ఆవాహన చేసుకుంటాం. వెలగపండు పూర్తిగా భారతీయఫలం.

భారతీయరైతాంగం ఈ పవిత్ర ఫలాన్ని ఏ కారణంచేతనో పెద్దగా తోటలువేసి పెంచటం లేదు. ముళ్ల చెట్టు కాబట్టి ఇళ్లలో వెయ్యటం లేదు. వెలగలో అమృతంతో సమానమైన పోషకవిలువలున్న సంగతి అటు రైతులకు, ఇటు ప్రజలకూ తెలియకపోవటమే అందుకు కారణం.

వెలగపండ్లు మామిడిలాగానే ఏడాదికొకసారి వచ్చేపంట. వినాయక చవితి వచ్చేసరికి వెలక్కాయల సందడి మొదలౌతుంది. కనీసం ఆరు నెలలైనా ఇవి అందుబాటులో ఉంటాయి. మామిడిని ఏడాది పొడవునా తినేందుకు అనేక ఉపాయాలు వెదికిన తెలుగువాళ్లు వెలగమీద అలాంటిదృష్టి పెట్టలేదు.



అవి అడవుల్లో వాటికవి పెరిగి మానవాళికి ఫలాలని స్తున్నాయి. రావి, మర్రి, నిమ్మ, మామిడి, వెలగ, జిల్లేడు, గన్నేరు మొదలైనమొక్కల్ని అమ్మవారిస్వరూపంగా ధ్యానిస్తారు - భక్తులు.

భాగవతం దశమస్కంధంలో రాసక్రీడానాట్యంగురించి ఉంది. ఈ నాట్య ప్రక్రియలో చెప్పిన హస్తముద్రల్లో 'కపిత్థ కరభావం' ఒకటి! వెలగపండు ఆకారంలో చూపుడు వ్రేలును, బొటనవ్రేలును తెరిచి ఉంచి, తక్కిన మూడువ్రేళ్లను మూసిఉంచితే అది కపిత్థకరభావం అనే హస్తముద్ర అవుతుంది. వెలగ గౌరినోముకూడా చేస్తారు.

నేలకేసి కొడితే పైకి ఎగిరితే పండినఫలం అని లెక్క. వాసనబట్టికూడా చెప్పవచ్చు. కొబ్బరిబోండాం లోపల ఉండే బీజభాగాన్ని మనం పీచు ఒలిచేసినా కొబ్బరికాయ అనే అంటాం. వెలగకూడా చెక్క / చెట్టు బెరడులాంటి దృఢమైన కవచాన్ని కలిగి ఉంటుంది. అందుకనే దీన్ని 'ఉడ్‌యాపిల్' అంటారు.

చింతపండులానే వెలగపండుకూడా పుల్లగా, తియ్యగా కమ్మని తీపిసువాసన కలిగి ఉంటుంది. పుల్లని ద్రవ్యమైనప్పటికీ, చింతపండులా కడుపులో మంట, కాళ్లనొప్పులు ఎసిడిటీ, గ్యాసు, ఉబ్బరం అల్సర్లను పెంచకుండా, వాటిని తగ్గించే ఔషధంగా పనిచేస్తుంది. చింతపండుకు ప్రత్యామ్నాయం వెలగ పండే! అన్నివ్యాధులవారూ తప్పనిసరిగా తినగలిగే ఏకైకఫలం వెలగపండుమాత్రమే!

పచ్చివెలక్కాయ వగరుగా ఉంటుంది. నేరుగా తింటే గొంతులో నసగా ఉంటుంది. అందుకనే గొంతులో పచ్చి వెలక్కాయపడ్డట్టు అలా నోరుమెదపకుండా ఉంటావే... అంటూంటారు. పచ్చికాయను నిప్పులమీద కాల్చితే లోపలి గుజ్జు ఊడి వస్తుంది. కొందరు ఆ కాయను వేణ్ణీళ్లలో కొద్దిసేపుంచి అప్పుడు పగలకొడతారు. షుగరు రోగులకు, స్థూలకాయులకూ వగరు రుచి తినాల్సిన అవసరం ఉంటుంది కాబట్టి, వారికి

### వెలగపండు గుజ్జులో ఉండే పోషకాల వివరాలు

**100గ్రాముల వెలగ గుజ్జులో 64.2% నీరుంటుంది. 7.1 గ్రాముల ప్రొటీన్లు, 3.7 గ్రాముల కొవ్వు, 5 గ్రాముల పీచు, 18.1 గ్రాముల పిండిపదార్థాలు, విషదోషాలను హరించే కెరోటిన్, కాల్షియం, ఫాస్పరస్, ఇనుము, ఇంకా ఇతర ఖనిజాలు ఇందులో ఉన్నాయి.**





పచ్చివెలగకాయ అనుకూలంగా ఉంటుంది. పెరుగుపచ్చడిగానూ, పచ్చడిగానూ, పప్పుగానూ తయారు చేసుకుంటారు.

పండినగుజ్జు సర్వశ్రేష్ఠం. తియ్యని సువాసన, తీపీ పులుపూ కలిపిన రుచి కలిగి ఉంటుంది. దీన్ని బెల్లంతో నూరి ఉండలు కట్టుకుని బుగ్గన పెట్టుకుని రసం మింగుతుంటారు. గర్భవతులకు వాంతులు ఆగటానికి ఇది మంచి ఉపాయం. మళయాళీలు కొబ్బరి, బెల్లం, వెలగ పండుగుజ్జు కలిపి నూరి, లౌజు ఉండలు ఇష్టంగా చేసుకుంటారు. జ్యూస్‌లూ, జామ్‌లూ తయారీకి వెలగపండు గుజ్జు అనుకూలంగా ఉంటుంది. వేసవిలో వాడుకోవటానిక్కూడా నిలవబెట్టే ప్రక్రియలో షర్బత్తులు చేసుకుంటే వడదెబ్బ తగలనీయని మంచిపానీయం అవుతుంది.





వాంతి, విరేచనాలు తగ్గిస్తుంది. మలబద్ధకాన్ని వదిలిస్తుంది. వాస్కోడిగామా వెంటవచ్చిన సైనికులకు ఓసారి కలరా సోకితే స్థానికులు ఈ పళ్లగుజ్జునే మందుగా ఇచ్చి తగ్గించారని, పోర్చుగీసులకు వెలగ అంటే ప్రీతి. జీర్ణకోశవ్యాధుల్లో వెలగపండు, మారేడుపండు ఔషధవిలువలు కలిగి సమానంగా పనిచేస్తాయి. మారేడు చేదుద్రవ్యం.

వెలగపండు ఆహారయోగ్యమైన కమ్మనిపండు. ఆగని వెక్కిళ్లను ఆపుతుంది. అలసటను పోగొడుతుంది. నీరసాన్ని తగ్గిస్తుంది. ఇనుము, ఇతర ఖనిజాల కారణంగా రక్తహీనత లేకుండా చేస్తుంది. రక్తశుద్ధికి తోడ్పడుతుంది. మూత్రవ్యాధుల్లో వెలగపండును తరచూ తింటూ ఉంటే మేలు కలుగుతుంది. నడివయసువారికీ, ఎదిగేపిల్లలకు కాల్షియం అవసరాలను అందిస్తుంది. లివరు వ్యాధులన్నింటిలోనూ దీనికి ఔషధగుణాలున్నాయి. అల్సర్లు, పేగు పూతలనుకూడా ఇది తగ్గిస్తుంది.

కపిత్థాష్టకచూర్ణం పేరుతో ఆయుర్వేదషాపుల్లో ప్రసిద్ధ ఔషధం దొరుకుతుంది. అర చెంచా నుండి ఒక చెంచా వరకూ పొడిని మజ్జిగలో కలుపుకుని రోజూ ఒకటి లేదా రెండు సార్లు తీసుకోవచ్చు. గుండెజబ్బుల్లో కూడా ఇది సహకరిస్తుంది. ఈ పండుగుజ్జు చలవనిచ్చేది కాబట్టి

**చింతపండుకు బదులుగా వెలగపండు గుజ్జుతో అన్ని వంటకాలూ చేసుకోవచ్చు. వెలగపండు గుజ్జుతో చేసిన పులిహోర చాలా ఆరోగ్యదాయకంగానూ, రుచిగానూ ఉంటుంది. వినాయకుడికి వెలగపండు పులిహోర పెడితే స్వామికరుణ అపారం.**



వీర్యవృద్ధికీ, జీవకణాలవృద్ధికీ సహకరిస్తుంది. నోటిపూతను, పళ్లలోంచి నెత్తురు కారటాన్ని తగ్గిస్తుంది. గ్యాస్‌ను తొలగిస్తుంది. నరాలకూ ఉత్తేజాన్నీ, శక్తినీ ఇస్తుంది.

కరి మింగిన వెలగ అని ఒక జాతీయం ఉంది. ఏనుగు వెలగపండు తిని, పండులోపల గుజ్జును జీర్ణం చేసుకుని, కవచంగా ఉండే చెక్కని యథాతథంగా విసర్జిస్తుంది. సంపదలుకూడా ఏనుగు మింగిన వెలగపండులా, పైకి పండుఆకారం అలానే ఉంటుంది కానీ, లోపల గుజ్జులా జీర్ణం అయిపోతాయి అని సుభాషితం. కరి అంటే నల్లనిబూజు. అది పడితే కాయ గుండ్రంగా స్వచ్ఛంగా కనిపిస్తుంది గానీ, లోపల గుజ్జు మాయమై పోతుంది. కాబట్టి, దాన్ని 'కరిమింగిన వెలగపండు' అంటారు.



'కరి' గురించి అలా ఉంచితే, మనిషి తిన్న వెలగపండు ఆరోగ్యానికి వెలుగే ఇస్తుంది.





# ప్రకృతివిలాసం

**రచయిత్రి-'సారస్వత కళానిధి' డా॥ వెలువోలు నాగరాజ్యలక్ష్మి,**
**పుటలు - 20+138=158,**
**సైజు-1/8 డెమ్మిసైజు, వెల-రూ.125/-,**
**ప్రతులకు - ఫ్లాట్.నెం.301, రామన్నటవర్సు, రామన్నపేట, మొదటిలైను, గుంటూరు-522007. సెల్-93941 13848.**

ప్రకృతి పంచభూతాత్మకం కనుక ప్రకృతిలోని ఋతువుల్నీ, మాసాల్నీ, కాలప్రభావాన్నీ, భక్తుల్నీ, మాతృమూర్తుల్నీ, నదీమతల్లుల్నీ–ఒక విశిష్టపద్ధతిలో ఐదు రూపకాలుగా రూపొందించినవిలాససంపద– ఈ పుస్తకం.

తి.తి.దే. చిత్రకారులు పి.శివప్రసాద్‌గారు రూపొందించిన కవర్‌పేజి ఈ పుస్తకానికి ఆదనపు ఆకర్షణ. ఇందులో– 1)ప్రకృతి విలాసం 2)మనపుణ్య నదులు 3)దేవీవిజయం 4)మాతృదేవో భవ 5)వనితా వైభవం అనే నృత్యరూపకాలు పంచ భూతాత్మక ప్రకృతికి సంకేతంగా రూపొందించారు రచయిత్రి.







ఈ రూపకాలలోని పాత్రలన్నీ స్త్రీ మూర్తులే. సంభాషణాత్మకంగా, సన్నివేశానికి తగిన ప్రాచీన, నవీనకవుల పద్యాలూ, కీర్తనలూ, గేయాలూ, శ్లోకాలూ పేర్కొంటూ సాగిన ఈ రూపకాలు ఒక్కొక్కటీ నేటి యువతకు గొప్పసామాజికస్ఫూర్తినీ, పవిత్ర సందేశాన్ని, ఆచరణాత్మకంగా అందించడంలో కృతార్థత చెందాయి.

ప్రకృతివిలాసం పర్యావరణ పరిరక్షణ ప్రధానసూత్రంగా సాగిన సందేశాత్మక వినూత్న సాహిత్యరూపకం. కాలాన్ని భగవద్రూపంగా పేర్కొని అందుకుతగ్గట్టుగా సంవత్సరాలూ, ఆయనాలూ, ఋతువులూ, మాసాలూ, వారాలూ, నక్షత్రాలూ–తమతమ సంచారంద్వారా ప్రకృతిని ఎలా పోషిస్తున్నాయో చిక్కనిశైలిలో సాగిన రచన. పాత్రలు – లలిత పరాభట్టారిక, శ్యామలామంత్రిణీదేవత, ఆరుఋతువులు.

"మనకోసమే మనప్రకృతి. ప్రకృతియే మానవుని తొలి గురువు. ప్రకృతిధర్మాన్ని విస్మరించి ప్రవర్తించవద్దు. స్థిరచిత్తంతో జీవించండి. ప్రకృతిని మనం రక్షిస్తే – ప్రకృతి మనల్ని రక్షిస్తుంది." అని ఈ రూపకసందేశం.

"మన పుణ్యనదులు" – మనిషికి ప్రాణాధారం నీరు. కనుక నదుల్ని దేవతామూర్తులుగా మన ప్రాచీనులు పూజించారు. నదీజలాల్ని కలుషితం చేసి, పర్యావరణాన్ని విషపూరితం చేయవద్దు అని సందేశం. ఇందులో పుష్కరదేవత, గంగ, యమున, నర్మద, గోదావరి, కృష్ణ, కావేరి పాత్రలు. నదులు స్త్రీ మూర్తులై లోకాలకు జీవంపోస్తున్నాయి. కనుక లోకంలో మహిళామూర్తుల్ని జాతిసంస్కృతికి కేంద్రబిందువులుగా భావించండి. మహిళామణులను ఆదరించండి అనే హితోపదేశం కూడా ఈ నృత్యరూపకంద్వారా రచయిత్రి నాగరాజ్యలక్ష్మి, సమాజానికి అందించారు.

దేవీవిజయం భక్తిసాహిత్యరూపకం. ఇందులో పాత్రలు లలితాదేవి, మహాలక్ష్మి, మహాకాళి, మహాసరస్వతి, ఆస్థానగాయని, శ్యామలా మంత్రిణీదేవి. ఆద్యంతం ముగురమ్మల వైభవాన్ని వివరించే రూపకం ఇది.

పురాణేతిహాసాల్లో మాతృమూర్తి ప్రభావంతో మహోన్నతవిజయాలు సాధించిన ప్రసిద్ధపాత్రలున్నాయి. ఆ మాతృమూర్తుల సౌశీల్యం, త్యాగం, ధైర్యం, స్థైర్యాలకు సోదాహరణంగా 'మాతృదేవో భవ' రూపకం వివరించింది.

ధైర్యసాహసాలకూ, మహోన్నతమైన సంస్కృతికీ ప్రతీక – మహిళ. మన హైందవ ధార్మికసాహిత్యంలో సాహసానికి మారురూపులుగా నిల్చిన మహిళామూర్తులను, వారి చరిత్రలను ప్రజలకు సుస్పష్టం చేసేరీతిలో సాగిన రూపకం 'వనితా వైభవం'.

ఈ ఐదురూపకాలు – ఎన్నో మార్లు మహిళామూర్తులే పాత్రలై ప్రదర్శితా లయ్యాయి. అన్నివర్గాల వాళ్ల ప్రశంసలూ పొందాయి.

రచయిత్రి డా॥వెలువోలు నాగరాజ్యలక్ష్మి చేసిన ఈ వినూత్నప్రయోగం ఎంతో స్ఫూర్తిదాయకం. ఇలాంటి సందేశాత్మకరచనలు యువతకు దివ్యప్రబోధాలు.

*– డా॥ కంపల్లె రవిచంద్రన్*

# యశోద స్వగతం

- శ్రీమతి చలసాని వసుమతి

యశోదమ్మ ఒక మధురమమతా సుధాసింధువు, వాత్స ల్యంతో పరవశమయ్యే అనుభూతి. పరమానందంతో కూడిన తన్మయానందాన్ని అనుభవించిన పరిపూర్ణమాతృదేవత.

బృందావనంలో ఆ రోజెందుకో అన్నీ అపశకునాలే. కలత పడుతోంది - యశోదమ్మ మనసు. ఇంతలో నందరాజుకూడా ఏదో ఉపద్రవం మరలా జరగబోతున్నట్లు చెప్పగానే వెన్న తినిపిస్తున్న తన ముద్దుల తనయుడిని గుండెకు హత్తుకుని, పమిటచెంగు కప్పింది, బెదిరినలేడిలా ఆ మాతృదేవత.

ఇంతలో ఏదో అలికిడి, గుసగుసలు, గోపాలకులు, గోపికలు వచ్చినట్లనిపించింది. నందరాజు బయటకు వచ్చాడు. ఎదురుగా అక్రూరుడు రథం దిగి వస్తున్నాడు. తటాలున కన్నయ్యను వదలి, యశోదమ్మ మేలిముసుగును సవరించుకుని వినయంగా నమస్కరించి, చల్లటిపానీయాలందించింది - జరగబోయేదేమీ తెలీని ఆ పిచ్చితల్లి,

అక్రూరుడు వచ్చినవేళ అది. సూర్యుడు తీవ్రంగా ఉన్నాడు. పద్మగంధి ఆవుపాలనే స్వయంగా తీసుకుని పెరుగు, వెన్న తయారుచేసి, తన్మయత్వంతో ఆ వైకుంఠపతికి తినిపిస్తోంది. ఆ గరుడధ్వజుడు కొంటెచూపులతో అమ్మను విసిగిస్తూ ఆరగిస్తున్నాడు.



కృష్ణరూపాన్ని అప్పటికే దర్శించి పునీతుడైన నందునింట అడుగు పెడుతూనే ఆదృశ్యాన్ని కనులారా చూచి తన్మయుడయ్యాడు. అక్రూరుడు బృందావనం వచ్చి, గోపికానిలయానికి అగ్నిలాంటి దుఃఖాన్ని రగిలించాడు. ఇది తెలియకపోయినా, ఏదో ఆవేదన యశోదమ్మకు.

"నేను అక్రూరుణ్ణి... తెలుసుకదమ్మా....! మధురనుండి వచ్చాను".

"చిన్నాన్నా! బాగున్నావా?..... మా క్రూరమామ ఎలా ఉన్నాడు?" అన్నాడు - అక్రూరుణ్ణి చూస్తూ మోహనకృష్ణ.

అక్రూరుడు ముకుందుని చెవిలో రహస్యంగా చెప్పినట్లనిపించింది- నందుడికి, యశోదమ్మకు. "నీవు దేవకీపుత్రుడివని కంసుడికి తెలిసిపోయింది. మరణభయంతో పన్నిన ఉపాయాలన్నీ ధ్వంసమవడంతో నిన్నూ, బలరాముడినీ స్వయంగా తీసుకురమ్మని నన్ను పంపించాడు. ఇదికూడా ఒక పన్నుగడే మురళీధరా!?" విన్నవించాడు-అక్రూరుడు ఆ పరంధామునికి.

యశోదమ్మచేతిలో వెన్న నిండిన బంగారు గిన్నె అలానే ఉంది. ఆమెకు దేవకీ వసుదేవుల పుత్రుడన్నమాట వినపడింది.

దిక్కులు, ప్రకృతి, ఆకాశం దద్దరిల్లి పోయింది. ఆమె ఇంద్రియాలన్నీ అచేతనమై, ఆమె హృదయంలాంటి నవనీతంతో నిండిన బంగారుగిన్నె క్రిందపడిపోయింది.

"అమ్మా! కంసుని ఆజ్ఞ. బలరామకృష్ణులను తీసుకువెళ్లటానికి వచ్చాను" ధైర్యంగా చెప్పాడు. వెంటనే నందరాజు యశోద చేయిపట్టుకుని భయపడవద్దని సైగచేయడంతో అక్రూరుడికి ధైర్యం కలిగింది.

"అమ్మా! యశోదతల్లీ! దేవకీవసుదేవుల అష్టమసంతానం ఈ కన్నయ్య ఇప్పటివరకు

నీదగ్గర దాచిపెట్టాం" అంటూ నందరాజువైపు చూస్తుంటే యశోద భర్తచేతిని వదలి క్రిందకు ఒరిగిపోయింది.

ముగ్ధమోహనుడు త్వరితగతిని అమ్మను స్పర్శించి "అమ్మా!" అని పిలిచాడు.

"ఏమౌతోందిరా కృష్ణా! నీవు దేవకీపుత్రుడివా! అయితే ఇప్పటివరకు దాసిలా పెంచానా? కన్నీరుమున్నీరుగా విలపిస్తోంది- యశోదమ్మ

"అమ్మా!" తటాలున కౌగిలించుకున్నాడు సుధామయుడు- ప్రేమతో. మరలా స్పృహకోల్పోతున్న తల్లిని కౌగలించుకుని "అమ్మా! మథుర ఎంతదూరం? ఇట్టే వచ్చేస్తాను. నేను చేయవలసిన పనులు చాలా ఉన్నాయి మథురలో. ఇప్పుడన్నావే దాసిలా పెంచానని... నీవు దాసివి ఎలా అవుతావమ్మా! కాదు ముమ్మాటికీ కాదు. ఈ సృష్టిలో ఆచంద్రార్కంగా వెలిగిపోయే నా తల్లివి యశోదమ్మవి" అన్నాడు.

తల్లిపాదాలకు నమస్కరించాడు - ముద్దులకన్నయ్య. ఆ స్పర్శకు ఈ లోకంలోనికి వచ్చింది - యశోద.

"నాన్నా ! కన్నా ! వెళ్ళివస్తావా? ఇదేమిటిరా వెళ్లిపోతు న్నావా? ఈ అమ్మను ఏం చేయాలని." దుఃఖంతో మాటలు కరువ య్యాయి.

"అమ్మా! నీవు ఇలా బాధపడి ఆరోగ్యం పోగొట్టుకుంటే నాకు వెన్న తినిపించే అమ్మ ఏది?" మురళీనాథుడు అమ్మ కన్నీళ్లు తుడిచాడు. అక్రూరుని అభ్యర్థనతో ప్రయాణసన్నాహాలు జరిగాయి. కన్నయ్య ఇంటిముందు రథం నిలిచివుంది. అయోమయంగా స్తంభించినమనస్సుతో శిలావిగ్రహంలా-నిలబడిన అమ్మానాన్న పాదాలకు నమస్కరించాడు నందకిశోరుడు.

"ఎంత నిర్దయగా వెళ్ళిపోతున్నావురా!" బిత్తరచూపులతో బేల అయిపోయింది- యశోద. శ్వాస స్తంభించింది. నేత్రాలలో నదులు ప్రవహిస్తున్నాయి. పంచేద్రియాలు నిస్తేజమైపోయాయి. ఇంత అకస్మాత్తుగా తన వెలుగు, తన చైతన్యం తననుండి దూరమై పోతుంది. అక్రూరుడు అతిక్రూరంగా తనబిడ్డను తీసుకువెళ్లి పోయాడు. తనలో తాను ఆక్రోశిస్తోంది - యశోదమ్మ.

చీకటి పడింది. అందరూ మాటలురాక వెళ్లిపోయారు. యశోదమ్మ కళ్లకు అంధకారం, మనసుకు శూన్యం ఆవరించాయి. ఏ ఆసక్తిలేని మనసుతో కన్నయ్యను ఒడిలోకి తీసుకోవాలనే కాంక్ష మాత్రం ఉంది. నా బ్రతుకు చీకటైపోయిందిరా ముకుందా! ఎలా తట్టుకోగలనురా! మానాన్న పోలిక, మీనాన్న పోలికలు వచ్చిన నీవు దేవకీపుత్రుడివి ఎలా అవుతావురా! ఇదేం చోద్యంరా!

రథంలో నాలోని చైతన్యాన్నికూడా తీసుకుపోయా వేమిటిరా కృష్ణా! ఈ భూమి కంపించి నన్ను తీసుకుపోతే ఎంత అదృష్టమో! కరిగిపోయింది, మాయమైంది వైభవం... ఆ కొంటె వాడు అలరించిన కాలపు కలకండలు కన్నీళ్లుగా మారిపోయాయిరా!

"కృష్ణా! నట్టింట్లో నీవుచేసిన అల్లరి, నేనుపడిన పాట్లు ఎలా మరచి పోగలనురా కన్నా! ఈ ప్రాపంచికదుఃఖాలే ఎరుగక నిన్నే మనస్సంతా నింపుకున్న ఈ పిచ్చితల్లిని ఎలా వదలివేయగలిగా వురా! మా మామగారు, మీతాతగారు పరమనిష్ఠాపరులు. శ్రీమన్నా రాయణుని భక్తులు, తపస్వి, ఈ ఇంటికోడలిని కావటమే నా అదృష్టమనుకున్నారు. అంతకంటే అదృష్టం నాకు నీవు జన్మించటమే అద్భుతం నాన్నా! గర్గాచార్యులవారు "ఈ పిల్ల వాడందరినీ ఆకర్షి స్తాడు, ఆనందపరుస్తాడు" అంటూ నీ నలుపు చూసి కృష్ణ అని నామకరణం చేశారు కదరా నాన్నా! రాహువు చెడుచోట ఉన్నాడని అన్నప్పుడు నాన్న, నేను కలవరపడుతుంటే ఆయన నవ్వి "బహు భార్యలుంటారమ్మా...!!" అని పరిహాసమాడితే నాన్న, మేము ఎలా నవ్వుకున్నాంరా! ఈ ప్రయాణం వెనుక ఈ నిజాలు దాగి ఉన్నాయా? అపాయం ఏమీ లేదన్నప్పుడు ఎంత నవ్వుకున్నామురా బుజ్జికన్నా!

"పద్మగంధి గోవుపాలే త్రాగే నీకు నా చేతులతో స్వయంగా వెన్న, పెరుగు పెట్టి పెంచాను కదరా! "పుట్టినబిడ్డ ఎదగక మానదు. ఎప్పుడో ఒకప్పుడు ఒడి వదలక మానదు" అన్నమాటలు ఇప్పుడు అర్థమౌతున్నాయిరా మోహనకృష్ణా! ఏమైపోతానో అనే బాధకంటే నీవలా నిర్దాక్షిణ్యంగా వెళ్లినందుకు తట్టుకోలేకపోతున్నాన్రా! ఇన్ని సంవత్సరాలు కళ్లలో పెట్టుకుని పెంచానురా వంశీమోహనా! ఎలా పెంచానురా వంశీధరా! ఆ రోజు జ్ఞాపకం-పసిగుడ్డువి. మజ్జిగ చేసుకోనివ్వటం లేదు. ఏడుస్తున్న నిన్ను భుజాన వేసుకుని కవ్వాన్ని గోపదాసికి ఇచ్చి బయటకు వెడుతుంటే వెనుకనుండి కవ్వం క్రిందపడి కుండబ్రద్దలైన శబ్దం. ఏమైందని వెనుతిరిగితే "అమ్మా! ఈ పసివాడు నన్ను వెక్కిరిస్తుంటే భయంవేసి వదలివేశానమ్మా!





కవ్వాన్ని" అంది ఆ పిల్ల బెదిరిపోతూ. అప్పుడైనా గ్రహించవలసింది నీరహస్యం. నీవు సామాన్యుడివి కాదని. చందమామని తినటానికి ఇవ్వమని తెల్లవార్లూ ఎంత ఏడ్పించావురా! అప్పుడు భరించిన అమ్మ కాదురా ఈ యశోద!

"ఆ రోజు మజ్జిగ చిలుకుతున్న నా దగ్గరకువచ్చి కళ్లు నలుపుకుంటూ ముంగురులు వెనక్కు నెట్టుకుంటూ పాలివ్వమని మారాం చేసి నా ముఖాన్ని నీవైపుకు తిప్పుకుని జాలిగా అడిగావు. ఇంతలో పాలు పొంగిపోతున్నాయని పరుగుతీశాను. అంతే.... కోపంతో కుండబద్దలు కొట్టావు కదరా అల్లరికృష్ణా! లాభంలేదని, భయపెట్టాలని బెత్తం పట్టుకుంటే పారిపోయి ఓ గదిలో దాక్కున్నావు. నేను నీ గది దగ్గరకొచ్చి మూసి ఉన్న కిటికీ తలుపు నుండి చూస్తే చీకటిలో పరంజ్యోతిలా మెరుస్తున్న నిన్ను చూచి చకితనయ్యాను. పెద్దరోటిని దొర్లించి ఎక్కి ఉట్టిమీద వెన్నతీసి తింటూ కిటికీలో నుండి కోతులకు పెడుతున్నావు కదరా కొంటెకృష్ణా!"

కన్నీరుమున్నీరుగా విలపిస్తోంది – యశోద. దాదాపు స్పృహకు దూరమైన యశోద "కన్నయ్యా! నన్ను వదలివెళ్లవద్దు" అంటూ ప్రక్కనే కన్నీరు పెట్టుకుంటున్న గోపిక చేయిని గట్టిగా పట్టుకుంది. యశోద మనసులోని బాధ గట్టతెగినవాగులోని నీరులా ఉప్పొంగుతూ ఉంది. ఆమె వేదనకు అంతం లేదేమో!

ఓ గోపమ్మ భరించలేక నీ చిలిపిపనులకు తన ఇంట్లో బంధించానని చెప్పినప్పుడు అమాయకంగా నా వెనుక నిలబడిన నిన్ను చూచి మూర్ఛబోయింది కదరా కృష్ణా! ఆ గోపమ్మ. ఎన్నెన్ని మాయలురా నీవి. అందాలభరిణెగా వచ్చిన పూతనస్తన్యం తాగుతున్న నిన్ను చూచీచూడగానే భయంకరరాక్షసిరూపంలో చచ్చిపడి ఉన్నదే. ఇది సాధారణవిషయమటరా కన్నాయ్యా!

నన్నెంత అమాయకురాలిని చేశావురా నాన్నా! అంతేనా. మన్నుతిన్నావని నోరు తెరిపిస్తే అవాక్కయిపోయాను కదరా, నేలమీద నడిచేవాడివటరా! తెలియకడుగుతాను. అసలెవరివిరానీవు? మోహంలో ముంచి, మాయచేసి నీనగుమోముతో బృందావనమంతా నింపి వేసింది ఇందుకేనా? ఇలా అదృశ్యమైపోవటానికా?

"దోగాడుతున్న నీకు నేల గుచ్చుకుంటుందని నీ క్రింద పరుపులు పరిచానురా. నీ కాళ్లకు మువ్వలు కట్టాను, మొలకు బంగారు మొలతాడు కట్టాను.... మనోహరంగా తప్పటడుగులు వేస్తున్న నీ చిరుగజ్జెల సవ్వడి, నా గుండెసవ్వడిగా మారింది కదరా వంశీకృష్ణా !

అడిగినప్పుడు పాలివ్వకపోతే పెరుగుకుండల్ని పగులగొట్టే వాడివి. రేపెలా మథురలో మనగలవురా? ఆకలికి ఆగలేవు. అమ్మను వదలలేవు. కృష్ణా! నాకెందుకురా ఈశిక్ష? నేల పాకుతూనే నీ నీడలతో ఆడుకుంటున్న నిన్ను నా హృదయానికి హత్తుకున్నప్పుడు నందరాజు కళ్లలో ఎందుకు నీరు వచ్చిందో ఇప్పుడర్థమైంది. ఏడుస్తూ భయపడే నిన్ను హృదయానికి హత్తుకున్న ఆ మాతృత్వపు మమతలు నన్నెలా వీడతాయిరా! తప్పటడుగుల శోభ, వచ్చీరాని మాటలు విందులు అందరాని మధురరసాస్వాదన పంచిన నీవు మణిమయబాలకుడివా కాదు... ముమ్మాటికీ కాదు. సౌందర్య మాధుర్యసుధాసింధునవు. సారస్వతమూర్తివి. జగన్మోహనుడివిరా."

దుఃఖం పొంగుకొస్తోంది – యశోదమ్మకు. ఆ రోజు దగ్గరలో ఉన్న గోశాలకు నీవు వెళ్లినప్పుడు తల్లడిల్లిపోయానురా, ఈ మధురస్మృతులు చుట్టుకుంటున్న నేను ఇంతదూరం వెళ్లిన నిన్ను తిరిగి ఎలా పొందనురా బుజ్జికన్నా!

నీ సాహసాలతోనే నా మనస్సంతా నింపివేశావు. అందరాని మధురరసాస్వాదన పంచి, నాఒడిలో నా స్తన్యం తాగి తన్మ



యుదయ్యేవాడివి. నీ విశాలఛాతిమీద గురిగింజలతో ఉన్న ముత్యాల దండలు, పులిగోరు పతకం, నీ అందమైన చుబుకం, పొంగులువారే కపోలాలు, కుండలాలు ఇది అని చెప్పలేని నీ నీలిమేఘఛాయ, బింబాధరం, కస్తూరి తిలకం, తెల్లతామరవంటి కనులు, నవ మౌక్తికం, ఆటలాడే గుబురుముంగురులు ఎంతో శ్రమతో నా చేతులమీదుగా తయారుచేసిన ఆ శిఖిపింఛం, మువ్వల పలు వరుసలు, మోహంలో ముంచివేసే నీ నగుమోము. ఎవరివిరా నీవు? ఇంత ముగ్ధమనోహరుడివి నిజంగానే దేవకీపుత్రుడివా? ఏ ఆసక్తి లేకుండాచేసి నన్నిలా ఇప్పుడు చైతన్యంలేని మోడులా చేశావు గదరా మురళీధరా! నమ్మలేకున్నాను. ఎవరితోనైనా సంప్రదించావటరా! హవ్వ.. ఇలా ఎవరికీ చెప్పకుండా వదలివేశావటరా!

నా చెంగుతో ముఖాన్ని కప్పుకొని నాముఖాన్ని నీవైపు తిప్పుకొని ముప్పతిప్పలు పెట్టావు. గోపికలకు నాతో కుండలన్నీ కొనిచ్చావు. వాళ్లరవికలన్నీ చింపి, వారికి కొత్తబట్టలిప్పించావు. గోపికల తిట్లకు కోపంవచ్చి ఎంత తప్పు చేశానురా! నిన్ను రోటికి కట్టేశాను.

అప్పుడే కదా నిన్ను బంధించవలసి వచ్చింది. రాత్రిళ్లు చెడ్డకలలొచ్చి నిన్ను లేపి కట్టేసినందుకు నన్ను క్షమించరా నాన్నా అంటే "లేదమ్మా బంధించడంవల్లే బంధమేర్పడిందమ్మా! జీవిత మంతా నీకు బందీనే కదమ్మా" అంటూ నన్ను మభ్యపెట్టి నిద్ర పుచ్చావు కదరా! నిదురలేక ప్రాయశ్చిత్తం అనుభవించింది నేను కదరా! ఈ శిక్షలసంగతులన్నీ దేవకికి చెపుతావటరా!

కాళిందిమడుగులో ఆ క్రూరనాగేంద్రుని మీద నీవు నాట్యమాడిన దృశ్యం నామనసులో నాటుకుపోయింది. అప్పుడు స్పృహతప్పిన నేను నీస్పర్శ తగలగానే నీవింకా ఆ పాము మీదే ఉన్నావని భయపడడం వలననేమో మరింతగా నిన్ను హత్తుకునే దానిని. ఎంతపని చేశావురా కన్నా! ఎంత ధైర్యంగా వెళ్లావురా!

అడవిలో దావాగ్నినుండి రక్షించావే గోవులను, గోప బాలురను, నూనూగుమీసాలతో మిసమిసలాడే నిన్ను గోపికలు చట్టుముట్టినప్పుడు వారివస్త్రాలన్నీ తీసుకుని ఏడ్పించావు కదరా! వారు చెబితే నేను నమ్మలేదురా! నిజం. ఇప్పటికికూడా. ఎందు కంటే పసిబిడ్డల్లే అమాయకంగా నా చెంగుమాటున దాగిన నిన్ను చూచి ఎలా నమ్ముతానురా!

ఇంద్రునిపూజగురించి చిన్నవాడివైనా నీకెందుకు చెప్పాలని మేము అనుకున్నప్పుడు..... ఏమన్నావురా! "ఉదారులు కానివారుకూడా కుటుంబసభ్యులముందు రహస్యాలుంచరు. అలాగే మిత్రులందుకూడా రహస్యాలు దాచకూడదు. సంపూర్ణ జ్ఞానంతో కర్మచేసినవారికి మంచిఫలమే కలుగుతుందని చెప్పావు. ఆశ్చర్యపోవటం మావంతైంది కదరా నాన్నా!

గోవర్ధనగిరి పూజ అయిన తరువాత ఇంద్రుని కోపానికి ఆహుతై మేఘనాథుడు కుంభవృష్టి కురిపించాడుకదరా నాన్నా! 'రక్షించమనే' ఆర్తనాదంతో బృందావనమంతా నీచుట్టూ చేరగానే చిన్నబాలుడు నేలమీద పుట్టగొడుగును లేవదీసినట్లు... గోవర్ధనగిరిని గొడుగులా లేపావు కదరా అల్లరికృష్ణా! నీవిలా సాహసం చేసినప్పుడల్లా నీమీద పాలాభిషేకం చేసే బృందావన వాసులు ఎంత పునీతులయ్యారురా! మధురమైననీళ్లతో ఆ రోజు పెరుగు నెయ్యి తేనెలతోకూడా పంచామృతాలన్నీ గ్రుమ్మ రించారు కదరా! నీ సాహసం చూచి ఈ మాతృహృదయం ఎంత ఆనందించిందిరా కన్నా! గర్వం కూడా కలిగిందిరా కృష్ణా! నా దగ్గర అమాయకుడిలా కన్పించి రాధనుకూడా నీ హృద యాజ్ఞిగా చేసుకుని ఆ పిచ్చితల్లిని నిర్దాక్షిణ్యంగా వదలివెళ్లా వురా.... ఆమె ఏమైపోవాలి? ఎలా జీవిస్తాంరా?

భుజంపై చల్లనిహస్తం పడటంతో త్రుళ్లిపడింది యశో దమ్మ. నందమహారాజు, ఉపనందుడు ఎదురుగా ఉన్నారు. జ్ఞాని అయిన ఉపనందుడు "అమ్మా యశోదమాతా! నందమహారాజా! నిరాకారబ్రహ్మానికి కారణమైన నారాయణుడమ్మా! నీబిడ్డ. మధుర వెళ్లిపోతున్నాడని తెలిసి నీవు స్పృహ తప్పినప్పుడు, ఆ పరబ్రహ్మ ధైర్యం చెప్పాల్సి వచ్చిందమ్మా! స్వయంగా మహావిష్ణు వైనప్పటికీ అంత ప్రేమనందించిన పిచ్చితల్లివి..... ధన్యురాలివమ్మా!

"పరంధాముడిగా అందరిహృదయాలను ఆహ్లాదపరచా లనే ఇంతఅల్లరి చేశాడు-మనకన్నయ్య. వాస్తవంగా ఈ అంత ర్యామికి తల్లీలేదు, తండ్రీ లేదు. బంధుమిత్రులూ లేరు. దుష్ట శిక్షణకోసమే ఈ నాటకమంతా.....!!" అంటూ అర్ధనిమీలిత నేత్రాలతో ఉపనందుడు చెబుతూ ఉంటే, పునీత అయిపోయింది యశోద.







పరుషంగా మాట్లాడితే ఎంతమిత్రుడైనా శత్రువు అవుతాడు

# సెప్టెంబరు, 2017 రాశిఫలాలు

బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటకృష్ణపూర్ణప్రసాద సిద్ధాంతి,
తి.తి.దే. ఆస్థానసిద్ధాంతి, రేలంగి



**మేషం-** వృత్తివ్యాపారాల్లో ప్రతికూలవాతావరణం, అయినా కొత్తపంథాలో ఆదాయసమీకరణ చేస్తారు. కుటుంబసభ్యులతో సంతోషంగా ఉంటారు. దూర ప్రాంతాలను సందర్శిస్తారు. ఇతరులకు సహాయ పడగలరు. అష్టమస్థానంలో వక్రించిన శనైశ్చరునిసంచారదోష నివారణకు ఈశ్వరాభిషేకం మంచిది.



**వృషభం-** బంధుమిత్రులతో, ఆనందంగా కాలక్షేపం చేస్తారు. నిరుద్యోగులకు వృత్తి ఉపాధిఅవకాశాలు పెరుగుతాయి. బాకీలు వసూలు అవుతాయి. ఒక ప్రణాళికప్రకారం అనుకున్నది సాధిస్తారు. మిత్రులనుండీ సహాయం లభిస్తుంది.



**మిథునం-** విద్యావ్యాసంగాల్లో ప్రథమశ్రేణిలో ఉంటారు. ధన ధాన్యవివర్ధనం, పుత్రపౌత్ర ప్రవర్ధనం అవుతుంది. నూతన వ్యాపార పద్ధతులను అవలం బించి ఇంతకంతా లాభాలు పొందుతారు. కుటుంబ వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటుంది. ప్రశాంతత కలుగు తుంది. నూతన ప్రణాళికలు రచించి ఆదాయమార్గాలు మెరుగు పరచుకుంటారు.



**కర్కాటకం-** వృత్తివ్యాపారాల్లో మెలుకవగా వ్యవహరి స్తారు. ధనాన్ని ఖర్చుచేసే ముందు ఆలోచించి పని చేస్తారు. సంతానం విషయంలో దిగులు. అకాల భోజనం, నోటిపూత మొదలగు ఇబ్బందులు, అర్ధా ష్టమగురుని ప్రభావంవల్ల ఆరోగ్యపరమైన అంశాల్లో మెళకువ అవసరం. మాసంమధ్యలో గురువారం ఈశ్వరాభిషేకం మంచిది.



**సింహం-** వృత్తివ్యాపారాలు బాగుంటాయి. ఇంటికి వస్తువులకు సంబంధించి మరమ్మతులు చేయిస్తారు. ధనం ఖర్చవుతుంది. సింహరాశికి రాహుకేతువుల దోషాలవల్ల ఏర్పడిన వ్యవహార ప్రతిభంధకాలు పూర్తిగా తొలగుతాయి.



**కన్య -** వృత్తివ్యాపారాల్లో ఉద్యోగవ్యవహారాల్లో మార్పులు ఫలప్రదమౌతాయి. ఆకస్మికధనలాభం. మిత్రులసహకారం ఉంటుంది. కార్యక్రమాలను ధైర్యంగా పూర్తిచేయగలరు. ఆకస్మిక ధనలాభములు కలుగుతాయి. ప్రణాళికలు ఫలిస్తాయి. కల్యాణాదిశుభకార్యాలు కలసి వస్తాయి.



**తుల-** ఉద్యోగఉన్నతి, పై అధికారుల ప్రశంసలు, చేసేవృత్తివ్యాపారాలు అనుకూలం. సమయాను కూలముగా వ్యవహరించి సమస్తకార్యాల్ని సాధించ గలరు. స్వల్పఅనారోగ్య సూచనలు కలవు.



**వృశ్చికం-**రాజసందర్శనం, బంధువులు స్నేహితులతో కూడి గొప్పసౌఖ్యం, దుఃఖనివారణం, ద్రవ్యలాభం, విశేషఆరోగ్యం, గురుభక్తి, మనస్సుకు నిర్మలత్వం, వస్తువస్త్రలాభాలు కలుతాయి. విద్యావిషయమై సరైన పంథాను అలవరచుకుంటారు. దీర్ఘకాలిక ప్రయోజనాలు నెరవేరే రీతిలో విద్యాభ్యాసం ఉంటుంది.



**ధనుస్సు-** చేతినిండా పని దొరుకుట, ధనార్జనకు మార్గం సుగమమగుట, కాంట్రాక్టులు, నూతన ప్రాజెక్టులు సాధిస్తారు. ధనం ఖర్చవుతుంది. ఆధికా రికంగా చెలామణి అవుతారు. ధనం ఖర్చుచేసి ఇబ్బందులు తొలగించుకుంటారు.



**మకరం-** ఆర్థికఇబ్బందులనుండి బయటపడగల్గు తారు. సమయానికి చేతికిధనం అందుతుంది. మిత్రులవల్ల సహాయం పొందుతారు. స్థానచలన సూచనలు కలవు. దత్తాత్రేయ, గురుగ్రహ పారాయ ణలు మంచివి. పవిత్ర పుణ్యతీర్థాలలో స్నానం క్షేత్రాలను దర్శి స్తారు. పట్టుదలతో కార్యసాధన చేయగలరు. పాతపద్దులు వసూలౌతాయి.



**కుంభం-** కళత్ర సంబంధ అనారోగ్యం వైద్యశస్త్ర చికిత్సలు అవసరమౌతాయి. వైద్యసహాయం కలుగు తుంది. ఇబ్బంది ఉండదు. గృహవాతావరణం మిశ్ర మంగా ఉంటుంది. నూతన వ్యవహారాలను సాధించడానికి ప్రణా ళికలు అమలుచేస్తారు. ఈ నెలలో స్థిరత్వం చేకూరుతుంది. వ్యసాయం అనుకూలం.



**మీనం-** ఆరోగ్యం విషయమై శ్రద్ధ అవసరం. ఆనా రోగ్యంనుండి కోలుకుంటారు. బంధువుల తాకిడి ఉంటుంది. సంతానం అభివృద్ధిలోకి వస్తుంది. అను కోకుండా ప్రయాణాలు చేయాల్సి వస్తుంది. అష్టమ గురుప్రభావంచే ఆరోగ్యం అంతంతమాత్రంగానే ఉంటుంది. ఈశ్వరారాధన మంచిది.



నటనను నేర్చిన మనిషికి ముక్తి రాదు

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)



## చందా నమోదు పత్రం

**1.** పేరు మరియు చిరునామా :
(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి & పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)

(పిన్‌కోడ్ తప్పని సరి)

సెల్ నెం.

**2.** కావలసిన భాష :
☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం
☐ హిందీ ☐ ఇంగ్లీషు ☐ సంస్కృతం (సంవత్సరచందా మాత్రమే)

**3.** సంవత్సర/జీవిత చందా :
☐ రూ.60/- ☐ రూ.500/-

**4.** చందా పునరుద్ధరణ :
(అ) చందా నెంబరు :
(ఆ) భాష :

**5.** చెల్లించిన మొత్తం :
డి.డి.నెం. :
తేది :
(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశం :
తేది :

చందాదారుని సంతకం

1) సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవితచందా రూ.500/-లు: డి.డి. / ఎం.ఓ.ను 'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి' వారిపేరున తీయాలి.

2) సప్తగిరిచందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమచందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గానీ లేక తెల్లకాగితంలోగానీ పైన పేర్కొన్నవిధంగా వివరాలు వ్రాసి, పంపవచ్చు. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. తి.తి.దే. ప్రధానసంపాదకకార్యాలయం, తిరుపతికి తప్ప-మీరు ఎవరిదగ్గర డబ్బులు కట్టి, మోసపోకండి.

3) మనిఆర్డరు పంపేవారు - అందులోనే మీచందావివరాలు వ్రాసి, ఈ క్రింది చిరునామాకు పంపాలి.

4) మా చిరునామా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి. ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 507".

5) ఇతర వివరాలకు ఫోన్ నెం.0877-2233333, 2277777.




| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | | 4 | | 5 |
| | | | | | | | | |
| 6 | | | 7 | | | | 8 | |
| | | 9 | | | | 10 | | |
| 11 | | | | | 12 | | | 13 |
| | | | | 14 | | | | |
| 15 | | | 16 | | | | 17 | |
| | | 18 | | | | 19 | | |
| 20 | | | | | | | | |

**నిర్వహణ** శ్రీ టి.ఎస్.జగన్మోహన్

### అడ్డం

2)బ్రహ్మ (7); 6)లక్క (2); 7)మారుమూలపల్లె (3); 8)కవిత (2); 11)శ్రీరామపత్ని (4); 12)విష్ణుమాల (4); 15)వైరి (2); 16)కుంభకారుడు (3); 17)వరుస (2); 20)సమవర్తి (7)

### నిలువు

1)పార్వతి (5); 2)మంజీరం (2); 3)గుణాలను తెలుసుకున్నవాడు(4); 4)పాపం కాదు (2); 5)సుత (3); 9)చ్యవన పత్ని (3); 10)నమస్కారం (3); 13)అభిషేకం (5); 14)రాయలవారి సచివాగ్రణి (4); 15)మొదలులేనిది (3); 18)భరతమాత (2); 19)రాజు (2)

జవాబులు ఈ సంచికలోనే ఉన్నాయి. అన్వేషించి... సరిచూసుకోండి.
- ప్రధాన సంపాదకుడు



Edited and published on behalf of T.T.Devasthanams by Dr. K.Radha Ramana, M.A., M.Phil., Ph.D., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by Dr.T.Ravi, M.A., Ph.D., P.R.O. & Dy. E.O.,(Publications & Press)FAC, T.T.D. Press, Tirupati - 517507.

